శ్రీమతేరామానుజాయ నమః





# భక్తామృతము

శ్రీ భగవద్రామానుజ తిరునక్షత్రోత్సవ

ప్రత్యేక సంచిక




గౌరవ సంపాదకులు :

ఉ. వే. శ్రీమాన్ K. S రామానుజాచార్య స్వామివారు

శ్రీమతే రామానుజాయ నమః



# భక్తామృతము

శ్రీ భగవద్రామానుజ తిరునక్షత్రోత్సవ

ప్రత్యేక సంచిక


రచయితలు:

ఉ. వే. శ్రీమాన్ K. T. రామానుజాచార్యులుగారు

ఉ. వే. శ్రీమాన్ N. V. L. N. రామానుజాచార్యులుగారు

గౌరవ సంపాదకులు :

ఉ. వే. శ్రీమాన్ K. S రామానుజాచార్య స్వామివారు

సంపాదకులు :

ఉ. వే. శ్రీమాన్ I. V. V. రాఘవాచార్యులుగారు



ఉభయ వేదాంత సభా ప్రచురణ

పెంటపాడు - 534 166

1992

# చందా వివరములు

1. మహారాజపోషకులు : 1116/-
వీరిపేరు ప్రతి సంచికలోను ప్రకటింపబడును.
సభా ప్రచురణలు 2 కాపీలు పంపబడును.

2. పోషకులు : 558/-
వీరి పేరు ప్రతి సంచికలోను ప్రకటింపబడును.
సభా ప్రచురణ 1 కాపీ పంపబడును.

3. అభిమానులు : 250/-
వీరిపేరు ఒక సంచికలో ప్రకటింపబడును.
సభాప్రచురణ 1 కాపీ పంపబడును.

4. సంవత్సర సభ్యత్వము 25/-
వీరికి పత్రిక ఒక సం॥రము పంపబడును.

చందాలు పంపవలసిన చిరునామా :

**N. V. L. N. రామానుజాచార్యులు**
కార్యదర్శి : ఉభయ వేదాంత సభ
పెంటపాడు – 534 166

శ్రీరస్తు

# వైదిక ప్రార్థన

వ్యాఖ్యాత :- ఉ. వే. శ్రీమాన్ K. S. రామానుజాచార్య స్వామివారు

మం॥ అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయో ధ్యస్మ జ్జుహురాణ మేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥

అర్థ: అగ్నే-(భక్తులను) ముందుకు నడిపించు; దేవ-ఓ! పరమాత్మా విశ్వాని-సమస్తములైన;వయునాని-పురుషార్థములను;విద్వాన్-తెలిసిన; (నీవు); జుహురాణం-కుటిలమైన; ఏనః-పాపమును; అస్మత్-మానుండి; యుయోధి-తొలగింపుము; సుపథా-మంచి మార్గము ద్వారా; అస్మాన్-మమ్ములను; రాయే-ధనము కొరకు; నయ-కొని పొమ్ము; తే-నీకు; భూయిష్ఠాం-అధికమైన; నమ+ఉక్తిం-నమశ్శబ్దమును; (నమస్కారమును) విధేమ - పలుకుదుము (కావింతుము)

తా॥ భగవంతుడు అగ్నికి అంతర్యామి అగుట చేతను ఉపాసకులను శ్రేయోమార్గమున ముందుకు నడిపించువాడు (అగ్రం నయతీతి అగ్నిః) అగుటచేతను ఇచట అగ్నే అని సంబోధింప బడు చున్నాడు. ఉపాసకులమైన మాకు ఏది శ్రేయోదాయకమో చక్కగా తెలిసిన ఓ! పరమాత్మా! నీవు ఫలప్రాప్తికి ప్రతిబన్ధకములైన మా పాపములను తొలగించి మంచి మార్గమున మమ్ము మాకు పెన్నిధియైన నీ సన్నిధికి చేరునట్లు ముందుకు నడిపింపుము. (మా శక్తిని బట్టియు, నీ అభిప్రాయమును బట్టియు) అధికమైన నమస్కారమును నీకు వాఙ్మాత్రమున గావించుచున్నాము.

# సంపాదకీయము

మేషార్ద్రా సంభవం విష్ణోర్దర్శన స్థాపనోత్సుకమ్
తుండీర మండలే శేషమూర్తిం రామానుజం భజే ॥

సకల చేతనోజ్జీవనార్థమై ఆదిశేషులు శ్రీభగవద్రామానుజులుగా అవతరించి 975 సం॥ములైనది. పింగళ నామ సంవత్సర మేష మాసమున పంచమీ ఆర్ద్రా నక్షత్రయుక్త గురువాసరమున శ్రీపెరుంబూదూరులో కాంతిమతీ ఆసూరి కేశవయజ్వలకు కుమారులుగా నవతరించిరి. వీరు వేంచేసియున్న కాలమందే వీరి అర్చావతార తిరుమేని (అర్చావిగ్రహము) శ్రీ పెరుంబూదూరు, తిరునారాయణ పురములందు ప్రతిష్ఠింపబడినది.

తెలుగువారి భాగ్యవశమున పశ్చిమగోదావరి జిల్లా, నరసాపురం పట్టణమున స్వామి అర్చారూపమున వేంచేసియున్నారు. వీరు అవతారస్థలమైన శ్రీపెరుంబూదూరులోనే ప్రతిష్ఠింపబడి అచ్చట స్వామితోపాటు ఏకాసనమున ఆరుమాసములు ఆరాధనాదులను స్వీకరించి అచట మొదలియాండాన్‌తో (పాదుకలతో) సహా నరసాపురమునకు వేంచేసెరి. అంతేకాక శ్రీపెరుంబుదూరు సన్నిధి వలెనే ఈ సన్నిధియు నిర్మింపబడినది.

శ్రీ స్వామివారి తిరునక్షత్ర సందర్భముగా వారి విషయమున వాచాకైంకర్యముగా ఈ ప్రత్యేక సంచికను ప్రకటించుచున్నాము. అంతేకాక స్వామివారి 8వ ఉత్సవమునాడు అనుసంధానముచేయు "తిరుమంత్రార్థమును" (నిగమనప్పడి) కూడ ఆంధ్రీకరించి భాగవతోత్తములకు అందించుచున్నాము. భాగవతోత్తములు మా ఈ ప్రయత్నమును ఆమోదించి "భక్తామృతము". మరింత త్వరితగతిని అందునట్లు ప్రోత్సాహము నొసంగ కోరుచున్నాము.

సంపాదకులు

శ్రీమతేరామానుజాయ నమః
శ్రీకృష్ణ సూరయే నమః

# నిగమనప్పడి

## తిరుమంత్ర ప్రకరణము

అనువాదకులు :. ఉ. వే. శ్రీమాన్ K.T. రామానుజాచార్యులుగారు

శ్రీమత్కృష్ణ సమాహ్వాయ నమోయామునసూనవే।
యత్కటాక్షైక లక్ష్యాణాం సులభశ్శ్రీధరస్సదా॥

పరమ కారుణికులగు పెరియవాచ్చాన్‌పిళ్ళైగళ్ అనుగ్రహించిన గ్రంధరత్నములలో నిగమనప్పడి అను గ్రంధము రహస్యత్రియార్ధ ప్రతిపాదకమై యున్నది. ఇయ్యది ప్రపన్న శిరోధార్యము సదాను సంధేయమై యున్నది. "నిగమనమనగ" లోనికి చొచ్చుట,సొంతముగ వెడలుట అని అర్ధము. పడి అనగ సోపానము, మెట్టు అని అర్ధము. మఱైయాయ నాల్‌వేదత్తుళ్ నిన్న మలర్ శుడరే [శాస్త్ర రూపమున నున్న నాల్గు వేదములలోని గూఢముగ ప్రకాశించునట్టి దివ్య తేజో వంతుడా] అనునట్లు "యో వేద నిహితం గుహాయాం"పరమే వ్యోమన్ అనునట్లు నున్న పరమాత్మ తత్త్వమును సమగ్రముగ ఎరుంగుటకు ఈ గ్రంధము సోపానము వంటిది కావున పెరియవాచ్చాన్‌పిళ్ళైకళ్ ఈ గ్రంధమునకు "నిగమనప్పడి'' అని నామమిడియుందురు. పడి అనగ గ్రంధము. తిరువాయ్‌మొళి దివ్యప్రబంధ వ్యాఖ్యానములకు ఆరాయిరప్పడి పన్నీరాయిరప్పడి ఈడు ముప్పత్తారాయిరప్పడి అనియు తిరుప్పావై వ్యాఖ్యానములకు మువ్వాయిరప్పడి ఆరాయి రప్పడి అనియు వ్యవహారము కలదు. ఆరాయిరప్పడి అనగా ఆరు వేల గ్రంధమని యర్ధము.

భగవత్తత్త్వ ప్రతిపాదక మంత్రములలో అష్టాక్షరీ మహా మంత్రము మిగుల శ్రేష్ఠమైనది. దానికి సాటియగు వేరొకమంత్రము ఏదియు లేదు. దీనినే పెరియ తిరు మంత్రమందురు.

ఈ తిరుమంత్రము ఎనిమిది అక్షరములను కలిగి పదత్రయాత్మకమై [మూడు పదములు గలదిగ] యున్నది. ఇందు మొదటి పదము "ఓం" [ప్రణవము] రెండవ పదము "నమః" మూడవ పదము నారాయణాయ. అకార ఉకార మకారముల కలయికచే "ఓం" అను తొలి పదము ఏర్పడినది. దీనియందలి ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క పదమగుటచే ఇదియు మూడు పదములతో నొప్పుచున్నది. రెండవ పదమగు "నమః" అనునది "న" అనియు "మః" అనియు రెండక్షరములు గలదై రెండు పదములుగ నున్నది. మూడవ పదమగు "నారాయణాయ" అనుపదము అయిదక్షరములు కలదై యున్నది. "ఆయ" అనునది నారాయణ శబ్దముపై వచ్చిన చతుర్థీ విభక్తి ప్రత్యయము. పైవిధముగ అక్షరశః పదశః విభజింపబడిన అష్టాక్షరీ మంత్రార్థమును క్రమముగ తెలిసికొందము.

మొదటి పదమగు "ఓం" అను ప్రణవమున మొదటి పదముగా నున్న అకారముచే భగవంతుడు సర్వరక్షకుడనియు, సమస్త కల్యాణ గుణాకరుడనియు, సర్వశేషి [అందరికి స్వామి] అనియు, శ్రీ మహాలక్ష్మీ వల్లభుడనియు తెలియుచున్నది.

రెండవ అక్షరమగు "ఉ" కారముచే అన్యశేషత్వ నివృత్తియు [అనగ మనము భగవంతుని కంటె ఇతరులకు దాసులము కాము అను దానిని తెల్పుట] భగవంతునికే మనము అనన్యార్హ శేషభూతలము అనియు తెలియ బడుచున్నది. అనన్యార్హ శేషభూతులనగ భగవంతునికే ప్రియమైన దాసత్వమును కలిగియుండి తదితరులకు అట్టి ప్రియ దాసత్వమును కల్గి ఉండకుండుట.

ఇక మూడవఅక్షరమగు "మ" కారముచే జీవుల సహజ లక్షణమగు జ్ఞానానందత్వము [జ్ఞానమును, ఆనందమును కల్గియుండుట] జ్ఞానమనే గుణము కల్గి ఉండుట [గుణమనగ స్వభావము] జీవుని నిత్యత్వము [అవినాశత్వము] జీవుడు అణుపరిమాణుడు. ఎప్పుడును ఎట్టి మార్పులు లేక ఎల్లవేళల ఒకే విధమగు రూపము కలవాడు. ప్రత్యక్షమగు జడ ప్రకృతి కంటె భిన్నుడను నర్థమును తెల్పిరి.

ఆపై "నమః" శబ్దార్థమును వివరించుచున్నారు. జీవగత అహంకార మమకారములను మరల్చుటయు మరల్చబడిన అహంకార మమకారములుగల జీవుని స్వరూపమగు అత్యంత పారతంత్ర్యమును [పరమాత్మకు మిక్కిలి అధీనుడై యుండుట] ఇట్టి పారతంత్ర్యమునకు పరాకాష్ఠమగు [చివరిహద్దు] తదీయ శేషత్వమును [భాగవత శేషత్వమును] పరతంత్రునకు అనువగు ఉపాయత్వమును నమశ్శబ్దముచే ప్రతిపాదించబడినవి.

నారశబ్దముచే జీవులయొక్కయు అచేతనమగు ప్రకృతియొక్కయు నిత్యత్వము జీవప్రకృతుల సమూహము [బాహుళ్యము] అట్టి సమూహముల యొక్క అసంఖ్యాతత్వము ప్రతిపాదింపబడినవి.

భగవంతుడు ధారకుడనియు ఈ విశ్వము నంతయు వ్యాపించి ఉన్నాడనియు సర్వ జగన్నియంత అనియు అతడు అన్నివిధముల మనకు బంధువనియు పరమ ప్రాప్యుడనియు అతనిని పొందించేవాడు అతడే అనియు అతడే సర్వ జగత్కారణ భూతుడనియు అయన శబ్దముచే ప్రతిపాదించిరి.

"ఆయ" అను చతుర్థీ విభక్తి ప్రత్యయముచే భగవంతునికి ఎల్లవేళల జీవుడు సేవలు చేయ ప్రార్థించ వలెనని తెల్పిరి.

ఏ విషయముల పైనను చక్కగ అర్థము చేసికొని తదను గుణముగ ప్రవర్తించవలెను. అందులకై అష్టాక్షరీ మహామంత్రము అర్థమైనదా? లేదా? అను విషయమును సోపపత్తికముగ వివరించుచున్నారు. శ్రీమన్నారాయణుని యందుతప్ప రక్షకాంతరమునందు [పెరొక రక్షకునియందు] ప్రతిపత్తి [ప్రాప్యబుద్ధి] కల్గినచో అట్టి అతనికి అకారార్థము అర్థము కాలేదనియు తలపవలెను. అన్యశేషత్వబుద్ధికల్గినచో ఉకారార్థము హృదయ గోచరము కాలేదని యెరుంగవలెను. ఆత్మకంటె భిన్నమగు దేహమున ఆత్మ భావన కల్గినచో మకారార్థము తెలియలేదని తలుపవలెను. తనకు తాను రక్షకుడనియు స్వరక్షణలో [తనకు తాను రక్షించుకొనుట] ప్రవేశమును శ్రీవైష్ణవ సమబుద్ధియు [అనగ తనను శ్రీవైష్ణవులతో సమానునిగా భావించుట] ఉపాయాంతరమును మనస్సున కల్గినచో నమ శబ్దార్థము అర్థము

కాలేదనియు భగవచ్ఛరీర భూతమగు చేతనా చేతనములతో రాగ ద్వేషాదులు కల్గినచో "నార" శబ్దార్థము తెలియ లేదనియు బంధువులు కాని వారి యందు బంధుత్వ బుద్ధి కల్గినచో "అయన" శబ్దార్థము అవగతము కాలేదనియు, భోగ్యములు కాని శబ్దాది విషయములందు భోగ్యతాబుద్ధి కల్గినచో "అయ" శబ్దార్థము తోచలేదనియు ఎరుంగ వలెను.

తిరుమంత్రమునకు (1) తాత్పర్యార్థము (2) వాక్యార్థము (3) ప్రధానార్థము (4) అనుసంధానార్థము అను నాల్గింటిని ఇక వివరింపబోవుచున్నారు. (1) తాత్పర్యార్థమనగ సారాంశము అష్టాక్షరీ మంత్రముచే తెలుపబడిన అర్థము సకల వేద శాస్త్రములచే అంగీకరింపబడియున్నది. (2) వాక్యార్థమనగ వాక్యము యొక్క అర్థము. అహం మహ్యంన నారాయణాయ ఏవ అని వాక్యార్థము ఇందు ప్రతిపాదింపబడినందున ప్రాప్య స్వరూపము [భగవత్స్వ రూపము] నిరూపింపబడినది. (3) ప్రధానార్థమనగ ముఖ్యార్థము అష్టాక్షరీ మంత్రముచే జీవస్వరూపము నిరూపింపబడుటయే ముఖ్యో ద్దేశము. (4) అనుసంధానార్థమనగ అనుసంధింప తగిన అర్థము ఈ మహామంత్రమును తలచునపుడంతయు మనకు భగవంతునికి గల నిత్య సంబంధమును స్మరింపవలెను.

మనకు భగవంతునితో గల నిత్య సంబంధమును ఇట్లు తెల్పుచున్నారు

(1) అకారముచే పితా పుత్ర సంబంధము. (2) ''అవరక్షణే'' అను ధాత్వర్థముచే రక్ష్య రక్షక సంబంధము. (3) లుప్త చతుర్థిచే [అకారవాచ్యాయ అనిచతుర్థి] శేష శేషి సంబంధమును (4) ఉ-కారముచే భర్తృ భార్యా సంబంధము. (5) మకారముచే జ్ఞాతృ జ్ఞేయ సంబంధము. (6) ''నమః'' పదముచే స్వస్వామి సంబంధము (7) నార పదముచే శరీరి శరీర సంబంధము. (8) అయన పదముచే ఆధారాధేయ సంబంధము. (9) ఆయ పదముచే భోక్తృత్వ భోగ్య త్వము [అనుభవించువాడు అనుభవింపబడునది] అను నవవిధ సంబంధములను ఈ గ్రంథమున తెల్పిరి.

నిగమనప్పడిలో తిరుమంత్ర ప్రకరణము ముగిసినది.

1-4

శ్రీమతే రామానుజాయ నమః

# యతిరాజ వైభవము

నిత్యం యతీంద్ర తవ దివ్య వపుః స్మృతౌ మే
సక్తం మనో భవతు వాగ్గుణ కీర్తనేఽసౌ
కృత్యంచ దాస్య కరణేతు కరద్వయస్య
వృత్యన్తరేఽస్తు విముఖం కరణ త్రయంచ॥

తిరువాయి మొళి పిళ్లైగారు ఆళ్వారు తిరునగరిలో భగవద్రామానుజుల సన్నిధిని నిర్మించి దానికి నలువైపుల 'శ్రీ రామానుజ చతుర్వేది మఙ్గలమ్" అను అగ్రహారమును ప్రతిష్ఠించి ఆ సన్నిధి కైంకర్యమును మణవాళ మహామునులకు అప్పగింప వారున్ను యతీంద్ర ప్రవణులై తమ యాచార్యులగు తిరువాయి మొళి పిళ్లై వారి ఆదేశాను సారము 'యతిరాజ వింశతి' యను స్తోత్రమును అనుగ్రహించిరి. ఈ విషయమునే శ్రీమాన్ యతీంద్ర "తవదివ్య పదాబ్జసేవాం, శ్రీశైలనాథ కరుణా పరిణామ దత్తామ్॥ " అను శ్లోకమున విశదీకరించిరి. అట్టి యతిరాజ వింశతిలో స్వామి భగవద్రామానుజుల వైభవమును ఒకింత సేవింతము.

ఇంద్రియములకు ఫలము భగవత్కైంకర్యమేయని "జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతోభజ శ్రీధరం పాణిద్వంద్వ సమర్చయ" యని శ్రీకులశేఖర పెరుమాళ్ అనుగ్రహించి యున్నారు! వాక్కుచేత కేశవుని కీర్తించవలె, మనస్సున మురరిపుని ధ్యానించవలె, కరద్వయముచే శ్రీధరుని అర్చించవలెను అని చెప్పియుండగా వరవరమునులీ శ్లోకమున 'స్వామీ! రామానుజా! నామనస్సు ఎల్లప్పుడు మీ దివ్య మంగళ విగ్రహమునందే ఆసక్తమగు గాక. నా వాక్కు ఎల్లప్పుడు మీ గుణ కీర్తనము నందే నిమగ్నమగు గాక! నా హస్తములు మీ కైంకర్యము నందే ప్రవర్తిల్లు గాక! నా

మనోవాక్కాయములు (త్రికరణములు) ఇతర విషయముల నుండి విముఖమగు గాక! అని అనుగ్రహించుచున్నారు.

తమ (మన) మనస్సు భగవద్రామానుజుల దివ్యమంగళ విగ్రహ ధ్యానము నందే నిమగ్నము కావలెను. ఆ దివ్య మంగళ విగ్రహ మెట్టిదనగా

పుండ్రైః ద్వాదశభిర్యుతం విలసితం దండై స్త్రిభిర్మండితం
కాషాయేణ శిఖోపవీత రుచిరం దోర్మూల చక్రాంబుజమ్
ఆసీనం జలజాసనేచ తులసీ పద్మాక్ష మాలాఞ్చితం
యుక్తఞ్జాఞ్జలి ముద్రయా రవినిభం శ్రీభాష్యకారం భజే॥

ద్వాదశ-ఊర్ధ్వ పుండ్రములు; త్రిదండము; కాషాయము, చిన్ని శిఖ; యజ్ఞోపవీతము; బాహు మూలములందు శంఖ చక్రములు; గళమున తులసీ పద్మాక్షమాలలు ధరించి పద్మాసనమున అంజలి ముద్రతో వేంచేసి యుండి సూర్యకాంతితో ప్రకాశించు శ్రీభాష్య కారులను సేవించుచున్నాను.

పీతాంబరం వరద శీతల దృష్టిపాతం
ఆజానులంబి భుజమాయత కర్ణపాశమ్
తన్మేఘ మేచక ముదగ్ర విశాల వక్షం
లక్ష్మీధరం కిమపివస్తు మమావిరస్తు॥

అనునటుల పీతాంబరమును, వేడుకొను వారి కోరికలను తీర్చ జాలు చల్లని కడగంటి చూపులును, ఆజాను బాహువును, దీర్ఘము లైన కర్ణములును, మేఘమువలె నల్లని కాంతివంతమైన వక్షస్థల మును కలిగి, లక్ష్మీధరము అగు ఒకానొక వస్తువు (సర్వేశ్వరుడు) నాకనుల ముందు సాక్షాత్కరించు గాక!" యనునటుల శ్రీమన్నా రాయణుడు కనులముందు సాక్షాత్కరించినను ఆ సౌందర్యమునకు వశ్యుడను గాక భగవద్రామానుజుల దివ్యమంగళ విగ్రహమే నా మనస్సున సాక్షాత్కరింపవలెను. వారిదివ్య మంగళ విగ్రహమును

సేవించునపుడు మనకు ప్రస్ఫుటముగా కనిపించునది వారి అంజలి ముద్ర. భక్తికి ప్రధానాంగము అంజలి. "అంజల యతీత్యంజలిః" అని అకార వాచ్యుడైన సర్వేశ్వరుని హృదయమును నీరు గావించునది. 'అంజలిః పరమాముద్రా క్షిప్రందేవ ప్రసాదినీ' అనునట్లు ఈ అంజలి ముద్ర శీఘ్రముగా భగవదనుగ్రహమును ప్రసాదించును.

ఇతరుల అనుగ్రహమును పొందగోరిగదా వారికి నమస్కరింతుము. ఈ నమస్కారము వలన అవతలి వ్యక్తి హృదయము కఱగి మన యభీష్టములను నెరవేర్చును. అట్లే మన భగవద్రామానుజులు చేసిన యీ అంజలికి ప్రయోజనము ఏమి? వారు భగవంతుని ప్రార్థించి పొందదగినదేదియు లేదుగదా! 'అచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ వ్యామోహితః తదితరాణి తృణాయ మేనే' అనునట్లు భగవత్పాదారవింద వ్యామోహితులై తదితరములైన సాంసారిక భోగములను తృణప్రాయముగా నెంచి సన్యసించినారు గదా! ఈ ప్రాకృత లోకముల నుండి పరమపదమునకు వేంచేయగోరి పరమపదమును ప్రార్థించుచున్నారందుమా! అదియును కాదు. "భౌజంగం వపురపహాయ శేషభోగే యుద్రూపం త్రిభువన వన్దితం జగామ।" అనునట్లు తిరుప్పార్ కడల్ (పాలసముద్రం) నుండిగదా అవతరించినారు. ఇక ఉభయ విభూతి నాయకత్వమే వారి యధీనమై యుండ కోరదగిన దేముండును?

ఇక వారి ప్రార్థనకు ఫలితమేమై యుండును? అని విచారించినచో దానికి సమాధానము వరవరమునులే యిట్లని అనుగ్రహించుచున్నారు.

కాలత్రయేపి కరణత్రయ నిర్మితాతి
పాపక్రియస్య శరణం భగవత్క్షమైవ
సా చ త్వయైవ కమలా రమణేర్థితా యత్
క్షేమస్స ఏవహి యతీన్ద్ర! భవచ్ఛ్రితానామ్॥

భగవంతుడు తన సంకల్ప మాత్రముననే ఈ చరాచర విశ్వమును సృజించునట్లు మనమును సంకల్పమాత్రముననే అమితములైన పాపకర్మలను చేయుచున్నాము. పాపములని తెలిసికొన్ని, తెలియక కొన్ని సర్వదా చేయుచునే యున్నాము. ఈ పూర్వోత్తరాఘములకు అంతము లేదుగదా! పూర్వాఘమనగా పూర్వము చేసిన పాపము. ఉత్తరాఘమనగా భగవత్ సంబంధ జ్ఞానము కలిగిన పిమ్మట ప్రామాదికముగా చేసిన పాపము.

యత్ బ్రహ్మకల్ప నియుతాను భవేప్యనాశ్యమ్
తత్కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే॥ అని కూరేశ మిశ్రులు అనుగ్రహించినట్లుగా అనేక లక్షల బ్రహ్మకల్పాంతములు అనుభవించినను తీరని పాపములను మనము అరక్షణముననందే చేయుచున్నాముగదా! అహా! పాపములను చేయుటలో మనకంటె గొప్పవారెవరు? అరక్షణములోనే అంతటి పాపములను చేసిన మనము మనజీవిత కాలములో ఎంతటి పాపములను చేసియుందుము. ఈ పాప ఫలిత మనుభవించుటకు ఎన్ని నరకములను అనుభవింపవలెను. ఎన్ని జన్మల నెత్తవలెను?

ఈ విధముగా మనము చేయు పాపములను గూర్చి మణవాళ మహాముని లే నిత్యం త్వహం పరిభవామి గురుంచ మంత్రం
తద్దేవ తామపి నకించిదహో బిభేమి
ఇత్థం శఠోప్య శఠవత్ భవదీయ సఙ్ఘే
హృష్టః చరామి యతిరాజ! తతోస్మి మూర్ఖః॥
అని చెప్పియున్నారు గదా! స్వామీ! యతిరాజా! నేను సర్వకాలముల యందును ఆచార్యుని; ఆచార్యానుగ్రహ లబ్ధమైన మంత్రమును; ఆ మంత్ర ప్రతిపాద్యుడైన సర్వేశ్వరుని పరాభవించుచున్నాను.

మంత్రత్తిలుమ్; మంత్రత్తుక్కుళ్లీడాన సప్తు విలుమ్ మంత్రప్రదనాన ఆచార్యన్ పక్కలిలుమ్ ప్రేమమ్ కనక్కవుణ్డానాల్ కార్యకర

మావదు', 'మంత్రే తద్దేవ తాయాంచ తథా మంత్ర ప్రదౌ గురౌ
త్రిషుభక్తి స్సదా కార్యా సాహి ప్రథమ సాధనమ్'

అని మంత్రమునందు మంత్ర ప్రతిపాద్యుడైన భగవంతుని యందు మంత్ర ప్రదాత యైన యాచార్యుని విషయమున ప్రేమ యుండిననే ఫలించును. అదియే మొదటి సాధనమని ప్రమాణములు ఘోషించుచుండగా నేను ఆవచనముల నాదరించి గౌరవింపక పోవుటయే కాదు, సదా పరిభవించుటయే కర్తవ్యముగా నెంచుకొంటినే' ఇందు ఆచార్య పరిభవమనగా "తన్నెంజిల్ తోత్తినదే శొల్లియిదు శుత్త వుపదేశవర వార్తయెన్బర్" అను విధముగా ఆచార్యుని వలన లభించిన అర్ధానుసారము చెప్పకుండుట; ఆచరింపకుండుట; మంత్ర పరాభవమనగా ఆచార్యు లుపదేశించిన మంత్రార్థమును మరచిపోవుట; లేక విపరీతార్థములను చెప్పుట; దైవ పరాభవమనగా సర్వేశ్వరుని సొత్తైన త్రికరణములను అన్యాధీనము చేయుట; భగవద్విషయక ప్రేమ లేకుండుట. ఇట్టి పాపములను చేయుటయే కాదు. అయ్యో! ఇట్టి దుష్కృతములనేల చేయుచున్నాననెడి భయము కాని, అనుతాపముకాని కొంచెమైనను లేదు. వాస్తవముగా యింతటి వాడనైనను దానిని పైకి కనబడనీయక నీ భక్తుల సముదాయములో చేరి నేనును భక్తునివలెనే ఆనందముతో తిరుగుచున్నాను. నా ఆనందమునకు కారణము ఇంతమందిని మోసగించి భక్తునివలె తిరుగుచున్నాను గదా! యని మాత్రమే.

నా మనోవాక్కాయములు సర్వదా స్వామి కైంకర్యము చేయవలసి యుండగా నేను వానిని చేయక భగవదపచార భాగవతాపచార అసహ్యాపచారములను చేయుచు మీ మనస్సునకు బాధను కలిగించుచు పైకి మాత్రము ప్రియమును చేయుచున్న వానివలెనే నటించుచు కాలము గడుపుచున్నాను. ఇట్టి నాకు ఒక నాడైనను చేసిన పాపములను గూర్చి భయముకాని; అనుతాపము కాని; సిగ్గు కాని కలిగినదా! లేదే! కలిగినచో మరల వానినెట్లు

చేయగలను? అనుతాపమే కలిగిన చేసిన పాపములకు ప్రాయశ్చిత్తము కలుగునే?

కూరత్తాళ్వాన్ ( కూరేశమిశ్రుల ) శిష్యులలో పిళ్లై పిళ్లైయాళ్వాన్ అనువారు ఒకరు. వీరు అభిజాత్యాదు లందధికులై భాగవతుల విషయము నందపచార పడుచుండిరి. ఈ విషయము కూరేశమిశ్రులకు తెలిసి వారిని దిద్దుబాటు చేయవలెనని తలంచిరి. ఒక నాటి సంక్రమణ పుణ్యకాలంబున పిళ్లైగారు దానములను చేయుచుండగా కూరేశులు వేంచేసి నాకును దానము నిమ్మని యడిగిరి. అంతట పిళ్లైగారు "స్వామీ! యీ ధనధాన్యాదులన్నియు మీ అధీనమై యుండగా నేను చేయు దానమేమి?" యని ప్రత్యుత్తర మిచ్చిరి. ఆ మాట విని కూరేశమిశ్రులు నాకు ధనధాన్యాదులు కావు కావలసినవి. మనోవాక్కాయముల చేత భాగవతాపచారము చేయనని ఉదక పూర్వకముగా వాగ్దానము చేయుడని కోరిరి. పిళ్లై గారు కూడ అట్లే గావించిరి.

ఇట్లుండ ఒకనాడు పిళ్లై గారు పూర్వము వలెనే భాగవతాపచారము గావించి; ఆచార్యులకు వాగ్దానము చేసియు తప్పియుంటి మే యని అనుతాపము చెంది సాపాటు చేయక యుండిరి. ప్రతి దినము తమ యింటికి వచ్చు పిళ్లైగారు ఆనాడు రాని కారణమును తెలిసికొన గోరి కూరేశులు పిళ్లైగారి గృహమునకు వేంచేసి విషయమును తెలిసికొని యిట్లని సమాధాన పరచిరి. "అయ్యో! యిట్టి పని గావించితినే! యిది మహాపరాధమే" అని అనుతాపము చెందుటచేత మానసికాపచారమును; భగవానుడు క్షమించును. రాజదండన భయముచే కాయికాపచారము గలుగజాలదు. ఇక వాక్కును మాత్రము స్వాధీనమందుంచు కొనవలెను" అని యీ వృత్తాంతమును శ్రీ వచన భూషణము ద్వితీయ ప్రకరణమున సేవింపవచ్చును.

పైన చెప్పినట్లు అనుతాపమేమైన కలిగినచో గదా! మానసికాపచారము నశించునది. ఆ అనుతాపమేమియు కలుగుటలేదు. పోనీ "నాభుక్తం క్షీయతే కర్మ" అనునట్లు అనుభవించి క్షీణింప జేసికొనజాలుదమా! అదియును సాధ్యము కాదు. దానిని తొలగించు కొనుటకు భగవంతుని కృపయే కావలెను. ''పోయ పిళ్ళైయుం పుగుదరువా నిన్లనవుం తీయినిల్ తూశాగుం శెప్ప" అనునట్లు సర్వేశ్వరుని కృపచేతనే ఆ పూర్వోత్తరాఘములు రెండును నశింపవలెను. ఆ కృప కలుగుటకు మనమేమి చేయవలెను? 'కృతాఞ్జలి పఞ్జరేషు' అనునట్లు అంజలి చేసిన చాలును.

సర్వేశ్వరుడు నిరంకుశ స్వతంత్రుడు. ఆయన ఏమి చేసినను ఏల చేసితివని గాని ఇట్లు చేయుమని గాని శాసించు వాడును లేడు. అట్టి నిరంకుశ స్వాతంత్ర్యము గల సర్వేశ్వరుని వద్దకు సాపరాధచేతనుడు పోయి తన దుష్కృతములను క్షమింపుమని వేడుకొనగా ఆయన యేమిచేయునో గదా! 'క్షిపామి' యనునో లేక క్షమించునో తెలియదు గదా! కావున సర్వేశ్వరుని క్షమాగుణము మనపై ప్రసరింప చేయగల వారిని ఆశ్రయింపవలెను. వారి ద్వారా భగవంతుని కృపను మనము పొందవలెను. అట్టి వారే భగవద్రామానుజులు.

అడయార్ కమలత్తు అలర్ మగళ్ కేళ్వన్ కైయాళి యెన్నుమ్
పడైయోడు నాన్దగముమ్ పడర్ తణ్డుం, ఒణ్ శార్ఙ్గవిల్లుమ్,
పుడైయార్ పురిశఙ్గముమ్ ఇన్దప్పూదలమ్ కాప్పతఱ్కెన్ఱు
ఇడైయే ఇరామానుశముని యాయిన ఇన్నిలత్తే

అనునటుల పంచాయుధములును భూలోక సంరక్షణార్థమై భగవద్రామానుజుల వారి యధీనములో నున్నవి.

శ్రుత్యగ్ర వేద్య నిజ దివ్యగుణ స్వరూపః
ప్రత్యక్షతా ముపగతస్త్విహ రఙ్గరాజః।

వశ్యస్సదా భవతితే యతిరాజ తస్మాత్
శక్తః స్వకీయ జన పాపవిమోచనే త్వమ్॥

ఉపనిషత్తులచే తెలిసికొన దగినవాడును, దివ్యమైన కళ్యాణ గుణములును స్వరూపమును గల సర్వేశ్వరుడు శ్రీరఙ్గనాథుడై వేంచేసియుండి నీకు వశ్యుడై నీయధీనము నందు కలడు గదా! కావున ఓ! యతిరాజా! నా పాపములను నశింపచేయుటకు మీరే సమర్థులు అనునట్లుగా శ్రీరంగనాథుడును; ప్రణుత రక్షా దీక్షిత పంచాయుధములును భగవద్రామానుజుల యధీనమందున్నవి. తనకు వశవర్తియగు సర్వేశ్వరునితో చెప్పి మన పాపములను వారే తొలగించగలరు. సర్వేశ్వరుని స్వాతంత్ర్యమువలె వీరిది నిరంకుశ స్వాతంత్ర్యమును కాదు. కావుననే మన విషయమై భగవంతుని సన్నిధిలో అంజలి బంధము చేయుచున్నారు.

భగవద్రామానుజులు శ్రీరంగమున వేంచేసియున్న కాలమున పంగుని ఉత్తరా నక్షత్రమున శ్రీ రంగనాథుడు శ్రీరంగనాచ్చియార్‌తో వేంచేసియున్న సమయమున గద్యత్రయమును అనుగ్రహించి సాపరాధులైన చేతనుల విషయమున శరణాగతి చేయుచు మనకై క్షమను అర్థించినారు. అందుచేకే వారి యంజలి బంధము. అట్టి భగవద్రామానుజుల దివ్య మంగళ విగ్రహము సదా నా మనస్సునందు నిలచి యుండవలెను.

"వాక్ గుణ కీర్తనేఽసౌ సక్తా భవతు" నా వాక్కు భగవద్రామానుజుల గుణ కీర్తనము నందే సక్తమగుగాక!

ఇంతవరకు నా వాక్కు శబ్దాది విషయ ప్రావణ్యమున తగనివారినందరను పొగిడి మాలిన్యమును చెందియున్నది. 'ఎన్నావిలిన్ కవి యానొరు వర్క్కుమ్ కొడుక్కిలేన్" నానాలుక నుండి పుట్టిన మధురమైన యీ కవిత్వమును నా స్వామి వేంకటాచలపతికి తప్ప వేఱెవ్వరికీ యజాలను అనిగదా! ఆళ్వార్లు చెప్పియున్నారు.

భగవంతుడు మనకు వాక్కు నిచ్చినదికూడ నోరార తన్ను స్తుతించుటకే గాని అల్పాస్థిర సంపద్ప్రదాత లగు సామాన్యులను స్తుతించుటకు కాదు. ఈ విషయమునే ఆళ్వార్లు మనకు పదేశించుచు

వాయ్కొణ్డు మానిడమ్ పాడవన్ద కవియే నల్లేన్
ఆయ్కాణ్డు శీర్వళ్ళల్ అళిప్పిరాన్ ఎవక్కేయుళున్

నా మాటలతో సామాన్యులైన నరులను పాడుటకు వచ్చిన కవిని కాను. వేద ప్రతిపాదితుడును సమస్త కళ్యాణ గుణాత్మకుడునైన సుదర్శనాయుధుడే నా కవిత్వమునకు లక్ష్యము -అని చెప్పియున్నారు. 'ఇంత వరకు అసద్విషయములను పొగిడి పొగిడి అనుభవించినదియు తృప్తి చెందినదియు లేదే! "గత జన్మలలో నాకు వాక్కు కలిగియుండియు నారాయణయని నిన్ను ఒక్కమారైనను స్తుతించి యుండను ఆకారణముచే గదా నాకీ గర్భవాసాది దుఃఖము లభించినది ఓ నాలుకా! నీకు నమస్కరింతును. నారాయణ యని యొక్కసారి పలుకుము" అని కులశేఖరాళ్వార్లు చెప్పినట్లుగా మనమెపుడోగాని నోరార భగవన్నామోచ్చారణ చేసి యెరుగము గదా! ఇన్ని దినములకు స్తుతింపదగినవారు కలరు. వారినే స్తుతింపవలెను అను జ్ఞానము కలిగినది. అయిన ఆ స్తుతింపదగిన వారెవరు? 'తిరువేఙ్గడత్తు ఎన్ఆనై ఎన్నప్పన్' వేంకటాచలమున వేంచేసియున్న నా యేనుగువంటి నా స్వామి శ్రీనివాసుడా! లేక 'పాడిసీర్ ఉయ్మిన్ నారాయణా ఎన్నుమ్ నామమ్" అని తిరుమంగైయాళ్వార్లు సాదించిన నారాయణ యను నామమా! అనగా ఆ రెండును కాదట"నెంజే శొల్లువోం అవన్ నామఙ్గళే"అని అముదనార్లు చెప్పిన భగవద్రామానుజుల తిరునామమునే చెప్పవలెను. ఆయననే స్తుతింపవలెను. వారి గుణములనే కొండాడవలెను.

అట్లు స్తుతింప బూనిన మొదటుగా స్తుతింపదగిన గుణము దయాగుణము. దయ అనగా ఇతరుల దుఃఖమును చూచి తానును దుఃఖితుడగుట. అనగా పరుల కష్టమును చూచి తన మనస్సు కరగి నీరైనపుడు గదా వానికి సహాయము చేయుదుము, అయినచో దుఃఖము హేయగుణము కాదా యన్నచో కాదనియే చెప్పవలెను. తన విషయమైన దుఃఖము హేయము కాని ఆశ్రిత కార్యసాధకమైన దుఃఖము గుణమని భావించియే శ్రీ వాల్మీకి మహర్షి "వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః" మానవులకు కష్టములు కలిగినపుడు రాముడు మిక్కిలి దుఃఖితుడగువాడు" అని గుణముగనే పేర్కొని యున్నారు. ఆత్మగుణములలో దయా గుణమే మొదటుగా నెన్నదగినది. దానిని మించిన గుణము లేదుగదా!

సర్వేశ్వరుని దయ కంటె ఆళ్వార్ల దయ గొప్పదట. కావుననే మధురకవులు "అరుళ్ కణ్డీరివ్వులగి నిల్ మిక్కదే" నమ్మాళ్వార్ల దివ్యమైన కృపారసము ఈ లోకము నందధికమై యుండుటను చూచితిరా! అని అనుచున్నారు. సర్వేశ్వరుని దయకు పాత్రులగుటకు ముందుగా మనము చేయవలసిన కృత్యములు కొన్ని యున్నవి. ఆయనకు అనుకూలుడై యుండవలె. ప్రతికూలమైన దానిని విడువవలె. ఆయనే రక్షకుడని విశ్వాసము గలిగి యుండవలె. ఆ పిమ్మట 'తవాఽస్మి' అనియో 'మామేకం శరణం వ్రజ' అని ఆయనే చెప్పినట్లుగా శ్రీమన్నారాయణునే శరణుగా పొందవలె. మనము 'తవాఽస్మి' అని పలుకనిచో ఆయన మనకు దూరుడుగనే యుండును. అట్లు పలుకుటకై మనకు తగిన జ్ఞానము కదా కావలెను. 'మానం ప్రదీపమివ కారుణికో దదాతి' దయావంతుడై తనను తెలిసికొనుటకు తగిన జ్ఞానమును పొందుటకై శాస్త్రముల నందించెను. కానీ 'శాస్త్రజ్ఞానం బహుక్లేశమ్' అనునట్లు అట్టి శాస్త్రము ద్వారా ఆయనను పొందుట ఎట్లు? తెలియనివానిని తనవద్దకు పిలచి బుజ్జగించి మంచిమాటలతో వానిని

తనవైపునకు ఆకర్షించుకొని తనవానిగా చేసికొనవలసిన వాడు ఉపదేశమధ్యముననే 'అవజానంతి మాం మూఢాః' ఇత్యాదిగా దూషణ వాక్యములు పలికిన దగ్గరకు చేరువాడు భయపడి పారిపోకుండునా! పోనీ ఆ శాస్త్రము నైననను అందరకు ఉపదేశింపరాదట "ఇదంతే నా తపస్కాయ నాభక్తాయ కదాచన। నచా శుశ్రూషవే వాచ్యం నచమాం యోఽభ్యసూయతి" అని రహస్యమైన యీ శాస్త్రమును అతపస్కునికి గాని; భక్తి లేనివానికి గాని; గురు శుశ్రూష చేయని వానికిగాని; భగవంతుని గుణముల యందు దోషావిష్కరణమును గావించు అసూయా పరునకు గాని చెప్పవలదని నిషేధించినారు. ఇంత చేసి తనను పొందుటకు మనకు కరణ కళేబరాదు లనుగ్రహించినాడు గాని తన పాదారవిందముల ననుగ్రహింపలేదు. "సమంవా విషమం వాపి నద్యోవా స్థావరాణిచ" అనునటుల ఎత్తు పల్లములు: నదులు కొండలు అను భేదము లేక అంతటా సమముగా కురియు మేఘమువలె అందరి యందు సమముగా ప్రసరింపవలసిన దయ అధికారి భేదమును బట్టి మారుచున్నది.

దీని ననుసరించియే పూర్వాచార్యులు "గుహ్యార్థములను వెనువెంటనే చెప్పరాద"ను మర్యాదను పాటించి సంవత్సరమో ఆరు మాసములో పరీక్షించి యదార్థముగా తత్త్వజిజ్ఞాసువులైన వారికి మాత్రమే రహస్యార్థములను ఉపదేశించుచు వచ్చిరి. కానీ భగవద్రామానుజులు అట్లుగాక "పారులకిల్ ఆశైయుడ యోర్క్కెల్లాం ఆరియర్‌గాళ్! కూఱుమెన్ఱు పేశి వఱుమ్బుఱుత్తార్ పిన్'' ఓ! ఆచార్యవర్యులారా! భూమండలమున గల వారందరికి అపేక్ష పడినంత మాత్రముననే రహస్యార్థముల నుపదేశింపుడు అని చెప్పి పూర్వాచార్యుల కట్టుబాటును సడలింప జేసిరి. ఆ వృత్తాంతమును తెలిసికొందము.

భగవద్రామానుజులు తిరు మంత్రార్థమును సేవించుటకై పదు

నెనిమిది పర్యాయములు గోష్ఠీపూర్ణులను ఆశ్రయించిరి. చివరకు గోష్ఠీపూర్ణులు ఈ మంత్రము యొక్క అర్థ గౌరవమును కాపాడుటకై పూర్వాచార్యులు యధికారము లేనివారికి తెలియకుండ కాపాడుచు వచ్చిరి. దీనినట్లే కాపాడుచుండుమని ఎన్నో శపథములు చేయించి మంత్రార్థము నుపదేశించిరి. ఆ మంత్రార్థమును పొందిన భగవద్రామానుజులు పరమ దయాంతరంగులై సంసారుల దుస్థితిని తలంచి "అయ్యో! ఇట్టివారు తరించుటకు ఈ మంత్రార్థమును పొందుట కన్న వేరు మార్గము లేదే" అని తలచి పూర్వ శపథమును విడచి ఆర్తులైన సంసారులందఱకు ఆ మంత్రార్థము నుపదేశించిరి.

ఈ సంగతి విని గోష్ఠీపూర్ణులు ఆగ్రహముతో ఆచార్యాజ్ఞ నతిక్రమించిన నీకేమి ఫలమో తెలియునా ? యని ప్రశ్నింపగా "స్వామీ! దీనికి ఫలము నరకమే, కాని ఈ మంత్రార్థ జ్ఞానము వలన ఈ సంసారు లందఱూ పరమపదమునకు వేంచేయగా నే నొక్కడను నరకమందుండిన నేమి'' అని యానతిచ్చిరి. అంత గోష్ఠీపూర్ణులు భగవద్రామానుజుల నిస్వార్థ బుద్ధికి, దయా స్వభావమునకు కరిగి నీరై "మానవులను ఉద్ధరించుటకై అవతరించిన ఆ రంగనాథుడవే నీవని " 'ఎంబెరు మానారే' అని ఆలింగనము చేసికొని ఇది మొదలు ఈ సిద్ధాంతము రామానుజ సిద్ధాంతమని వెలుగొందు గాక యని యానతిచ్చిరి.

ఇట్లు స్వార్థమును త్యజించి లోకుల దుస్థితిని తలంచి తాము నరకమునకు పోవుటకైన నిచ్చగించి మనకందఱకు మంత్రార్థము నుపదేశించిన భగవద్రామానుజుల దయా గుణమును ఏమని; ఎట్లని, ఎంతని స్తోత్రింప వచ్చును. అట్టి రామానుజుల గుణకీర్తనము నందే నావాక్కు ఆసక్తమగు గాక!

కృత్యంచ దాస్య కరణేతు కరద్వయస్య: నా హస్తద్వయము దేవరవారి కైంకర్యమునందే సక్తమగు గాక! హస్తములకు కైంకర్యమే ప్రయోజనము గదా! 'పాణిద్వంద్వ సమర్చయ' అని అనతిచ్చినారు కులశేఖరాళ్వార్లు. ఆ కైంకర్యమునకు ఆశపడి యేగదా లక్ష్మణస్వామి 'అహం సర్వం కరిష్యామి' నేనే సమస్త కైంకర్యములను చేయుదునని అరణ్యమునకు బయలుదేరెను. కైంకర్యము లేనిదే శేషత్వము నిలువజాలదు గదా! అయినచో సర్వేశ్వరుని విషయమున కదా కైంకర్యము చేయవలసినది. అనగా సర్వేశ్వరుని విషయమున చేయు కైంకర్యము ప్రథమ పర్వము (మొదటి సోపానము) భగవద్రామానుజుల విషయమున చేయు కైంకర్యము చరమపర్వము (చివరి సోపానము) ఈ కైంకర్యము మానసిక, వాచిక, కాయిక భేదము కలదైన "వపుస్మృతౌ మే" అనుటచే మానసిక కైంకర్యము 'వాగ్గుణ కీర్తనే' యనుటచే వాచిక కైంకర్యము చెప్పబడినది. ఇచట 'కరద్వయస్య దాస్య కరణేతు' అనుటచే కాయిక కైంకర్యమే చెప్పబడుచున్నది.

భగవద్భాష్యకారులు శ్రీరంగనాథుని సన్నిధిలో కైంకర్యపరులు చేయుచున్న కొన్నియనాచారములను సహింపక వారిని దిద్దుబాటు చేయవలసి వచ్చెను. దానిని సహింపక కొందరు స్వామి వారి భిక్షాన్నమున విషప్రయోగము గావించిరి. స్వామి యిది తెలిసికొని ఆ భిక్షను పారవైచి ఉపవాసముండిరి. ఈ విషయమును తెలిసిన గోష్ఠీపూర్ణులు స్వామి శిష్యులలో నొకరగు ప్రణతార్తి హరాచార్యులను వారిని భగవద్రామానుజుల మహానస (వంటయిల్లు) కైంకర్యమును చేయుటకు నియమించిరి. అది మొదలు స్వామి రామానుజులు మఠమునందే భిక్షను స్వీకరించుచు వచ్చిరి. అట్టి అంతరంగ కైంకర్యమున నా హస్తద్వయము ప్రవేశింపవలెను గదా!

వడుగనంబి యనువారు తమకు ఉపాయ ఉపేయములు

రెండును భగవద్రామానుజులే యని విశ్వసించినవారు. "కణ్ణన ల్లాల్ దెయ్వమిల్లై" కృష్ణుని కన్న దైవము లేదను ఆళ్వార్లవలే "రామానుజుల కంటె పరదైవము లేద"ను విశ్వాసము గలవారు. "అణియరఙ్గం ఎన్నముదనై - కణ్డకణ్గల్ మత్తొన్ఱినై క్కాణావే" శ్రీరంగమున శయనించియున్న నా అపర్యాప్తామృత స్వరూపుడగు రంగనాధుని సేవించిన కనులు వేఱొక వస్తువును చూడవు" అని తిరుప్పాణి ఆళ్వార్లు ఆనతిచ్చినట్లుగా భగవద్రామానుజులను తప్ప వేరెవరినీ సేవింపనివారు గదా! వడుగనంబి.

వీరు మఠమునందు స్వామి ఎంబెరుమానార్లకై పాలు కాచు చుండగా మఠము వాకిలియందు శ్రీరంగనాధులు ఉత్సవముగా వేంచేసిరి. భగవద్రామానుజులు శ్రీరంగనాధుని సేవించి వడుగా శ్రీరంగనాధుని సేవింప రమ్ము అని పిలచిరి, ఆ మాటలు విని వడుగనంబి మీ పెరుమాళ్ళను సేవింపవస్తే నా పెరుమాళ్ళకు కాచు పాలు పొంగిపోవా? రావడానికి వీలులేదు -అని చెప్పినారట అటువంటి కైంకర్యమునే మణవాళ మహామునులు కూడ కోరు చున్నారు.

ఉన్నై యొழிయ ఒరుదెయ్వం మత్తఱియా
మన్ను పుగళ్ శేర్ వడగనమ్బి - తన్నిలైమై
ఎన్దనక్కు నీతన్దు యతిరాశా - ఎన్నాళుం
ఉన్దనక్కే యాట్కొళ్ పుగన్దు॥

భగవద్రామానుజా! యతిరాజా! మీరు తప్ప వేరుదైవము నెఱుగని వడుగనంబిగారి నిష్ఠను దాసునికి ప్రసాదించి యెల్లపుడు దేవర వారి కైంకర్యమునందు దాసుని స్వీకరింపవలెను. అట్టి కైంకర్య మును గదా! మనము ప్రార్థించి పొందదగినది.

అయినచో భగవద్రామానుజులు వేంచేసియున్న కాలము నందుగదా యీ కైంకర్యము నపేక్షింపవలసినది. ఇపుడు అపే

క్షించుటయు చేయుటయు అసంగతము కదా! యని భావింపవల దు. మనము చేయు కైంకర్యము లన్నియు స్వీకరించుటకు స్వామి అర్చావతారముగా వేంచేసియే యున్నారుగదా! ఆ అర్చా వతార విషయమున కైంకర్యము చేయుటయే మనకు పరమ పురు షార్థము. సర్వేశ్వరుడు వైకుంఠము, తిరుమలై; తిరుమాలిరుం శోలైమలై మున్నగు దివ్య దేశములందు వేంచేసియున్న విధమున భగవద్రామానుజుల హృదయారవిందమున కూడ వేంచేసియున్నా రు కదా! అట్టి రామానుజుల కైంకర్యమును చేసిన ఆకైంకర్యము వారి హృదయాంతర్వర్తియగు శ్రీమన్నారాయణుని వరకు చేరును సర్వేశ్వరుని కైంకర్యమని పేరుచేయ నవసరము లేదు. భగవద్రా మానుజుల కైంకర్యము నందే నిష్ఠులము కావలెను.

'వృత్త్యంతరేస్తు విముఖం కరణ త్రియంచ'

నా మనోవాక్కాయములు మిగతా వృత్తుల నుండి విముఖమగు గాక యనుచున్నారు. మొదటి మూడు పాదముల చేతను కరణత్రియమునకు చేయవలసిన పనిని చెప్పి దానినే వ్యతిరేకముఖముగా చెప్పుచూ స్థిరీకరించు చున్నారు. అనగా నా కరణత్రియము భగవద్రామానుజుల విషయమున తప్ప వేరు విషయమున ప్రవర్తింపరాదని ప్రార్థించుచున్నారు.

తిరువరఙ్గత్తు ముదనార్లు అనుగ్రహించిన "ఇరామానుశనూత్త న్దాది" యను దివ్యప్రబంధములో ("నిన్ఱవణ్";"పేరొన్ఱు"'పాట్టిల్') ఆనతిచ్చి నట్లుగా కర్మ; జ్ఞాన; భక్తి; ప్రపత్తులు ఉపాయములుకావు. 'భగవద్రామానుజుల పాదార విందములే ఉపాయ ఉపేయములు.' రామానుజ సన్నిధి లోనే ప్రపత్తి చేయవలెను. "రామానుజ"అను నాల్గు మధురాక్షరములే మనకు తిరుమంత్రము. వారి సన్నిధిలో చేయు కైంకర్యమే పరమ పురుషార్థము. ఇదియే నిశ్చితమైన నా సిద్ధాంతము" అని ఆనతిచ్చినారు నడాదూరు అమ్మాళ్ అనువారు.

కూరత్తాళ్వార్లును "నారాయణ, రామానుజ'' అను మంత్ర

ములు - రెండింటిలో కేవలము మోక్ష హేతువైన రామనుజ యను తిరునామమే యధికమని ఆ తిరునామ మనకు లభింపనిచో మనమే బోటివారలే యవస్థను పొందుదురో గదా యని దురపిల్లుచు
"నచేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ।
కామవస్థాం ప్రపద్యన్తే జంకవో హంత మాదృశః॥ అనిసాయించిరి.

కావున ప్రపన్నులైన వారందరు భగవద్రామానుజుల వైభవమును తెలిసికొని వారి దివ్యమంగళ విగ్రహమును సేవించి హృదయమున నిలుపుకొని; వారి గుణకీర్తనము చేయుచు వారి కైంకర్యము వొనర్చుచు, వారి యనుగ్రహమునకు పాత్రులు కావలయును.

శ్లో॥ పుణ్యాంభోజ వికాసాయ పాపధ్వాన్త క్షయాయచ।
శ్రీమానా విరభూద్భూమౌ రామానుజ దివాకరః॥

శ్లో॥ శేషోవా సైన్యనాథోవా శ్రీపతిర్వేతి సాత్త్వికైః।
వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మఙ్గళమ్॥



# భగవద్రామానుజ అవతార వైభవము

వేదాన్తానా మసీమ్నాం గురుతర గహనార్థైక వాక్యత్వపూర్వం
వ్యాఖ్యాతృత్వాచ్చ శేషం గురుభర వహనాత్ ఈశితుస్సైన్యనాథమ్।
సాధుత్రాణాత్తదన్య ప్రమథన కరణాచ్చాపి తత్పఞ్చహేతీ
నాచార్యత్వస్య పూర్త్యాయ ముతరకృపం శ్రీపతించాహురార్యాః॥

ప్ర॥అ: అసీమ్నాం-అవధిలేని; వేదాంతానాం-వేదాంత వాక్యముల ను; గురుతర-మిక్కిలి వైశిష్ట్యము కలవియై; గహన-దుర్గ్రాహ్యము లైన; అర్థ-వాక్యార్థములను; ఏక వాక్యత్వ పూర్వం-ఏకవాక్యత కలుగునట్లుగా (పరస్పర విరోధము లేకుండగ) వ్యాఖ్యాతృత్వాత్-వ్యాఖ్యానించుట వలన; శేషం-ఆదిశేషులని; ఈశితుః-సర్వేశ్వరుని యొక్క; గురుభర వహనాత్-గొప్ప భారమును (చేతనుల నుద్ధరించు భారమును)మోయుటవలన; సైన్యనాథం-విష్వక్సేనులని; సాధు త్రాణాత్-సత్పురుషులను రక్షించుటవలన; తత్ అన్య ప్రమథన కరణాత్-అసాధువులను (కుమతులను) మర్దించుటవలన; తత్-ఆ సర్వేశ్వరుని యొక్క; పంచహేతీన్-పంచాయుధములని; ఆచార్య త్వస్యపూర్త్యా-ఆచార్యత్వపూర్తిచే; ఉరుతరకృపం-మిక్కిలి గొప్ప దయగల; శ్రీపతించ-శ్రీమన్నారాయణుడని; ఆర్యాః-పెద్దలు; యం-ఏభగవద్రామానుజులను ఆహుః-పలికిరో (తంవన్దే-వారిని నమస్క రించుచున్నారు)

తా॥ గహనార్థములైన వివిధ ఉపనిషద్వాక్యములకు ఏకవాక్యత ను సాధించుటచే ఆదిశేషులనియు; సకల చేతనోజ్జీవన భారము వహించుటచే విష్వక్సేనులనియు: సాధుత్రాణ విమతనిరసనాదుల చే పంచాయుధములని ఆచార్యత్వపూర్తిచే పరమకృపగల శ్రీమన్నారాయణుడని భగవద్రామానుజులు పెద్దలచే కీర్తింపబడు చున్నారు.

వ్యాఖ్య: "అనంతా వై వేదాః" అని వేదములు అనంతములు. ఈ వేదము పూర్వభాగమని, ఉత్తర భాగమని రెండు విభాగములు చేయబడినది. అందు పూర్వభాగమునకు కర్మకాండయని, ఉత్తర భాగమునకు బ్రహ్మకాండయని పేరు. ఆ బ్రహ్మకాండయే ఉపనిషత్తులు. వేదములెట్లు అనంతములో అట్లే ఉపనిషత్తులును అనంతములైనవి. ఇవి పరబ్రహ్మను బోధించునవియై దుర్గ్రాహ్యములై యున్నవి. నిర్వేదము కలిగినగాని తత్త్వజిజ్ఞాస కలుగదు. వేదము ద్వారానే పరమాత్మను తెలియవలెను కావుననే "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్" అని శ్రుతి తెలుపుచున్నది. అనగా తత్త్వజ్ఞానార్థమై సదాచార్యులను ఆశ్రయింపవలెను ఆ గురువు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడై యుండవలెను.

పరమాత్మ ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియబడు అచిత్ పదార్థము కంటె అట్టి అచిత్ పదార్థముతో చేరినట్టి; చేరనట్టి (ముక్తావస్థలో) చిత్ పదార్థము కంటె భిన్నుడు, దోషరహితుడు, జ్ఞానానందైక స్వరూపుడు, సమస్త కళ్యాణగుణాత్మకుడు. ఇట్టి సర్వేశ్వరుడు ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కాడు. ఉపనిషత్ వాక్యముల చేతనే తెలుసుకొనవలెను.

ఈ శ్రుతులను సగుణ-నిర్గుణ-ఘటక శ్రుతులని: భేదా భేద శ్రుతులని భిన్న భిన్నములుగా నున్నవి. భగవద్రామానుజులకు పూర్వులై వేద సామ్రాజ్యము నంగీకరించిన కొందరు ఆచార్యులు నిర్గుణ శ్రుతులను-అభేదశ్రుతులను ప్రమాణముగా స్వీకరింపగా, కొందరు భేదశ్రుతులను ప్రమాణముగా స్వీకరించిరి. కాని భగవద్రామానుజులు ఈ శ్రుతులన్నిటిని సమన్వయము చేసివానికి ఏకవాక్యతను కూర్చిరి. ఉన్న గుణములను నిషేధించుట జరుగును కాని లేనివానిని నిషేధించుట జరుగదు గదా! కనుక పరమాత్మకు గుణములు కలవు అనునది పూర్వశాస్త్రము, గుణములు లేవు అనునది పరశాస్త్రము. 'ఉత్తరోత్తరం బలీయం' అను న్యాయానుసారము

పూర్వోక్త సగుణశ్రుతులను తరువాత చెప్పిన నిర్గుణశ్రుతులు నిషేధించుటచే పరమాత్మ నిర్గుణుడని కొందరు చెప్పుదురు.

బృహదారణ్యమున "సర్వస్యవశీ సర్వస్యాధిపతిః (అన్నింటిని వశమందుంచు కున్నవాడు అందరకు అధిపతి యైనవాడు) అని ఆయన గుణములను చెప్పి, చివరకు 'సఏషనేతినేతి ఆత్మా అగృహ్యా నహిగృహ్యాతే" (పరమాత్మ ఇతః పూర్వము చెప్పబడిన గుణములు కలవాడు కాడు అతనిలో ఈ గుణములున్నట్లు గ్రహింపబడుట లేదు) అని నిషేధించుటచే పరమాత్మ నిర్గుణుడని చెప్పుదురు. కానీ శ్రుతి మొదట గుణములున్నవని చెప్పి పిమ్మట లేవు లేవనుట పిచ్చివాని మాటగదా! కనుక "నేతినేతి" అను వాక్యమునకు పూర్వోక్తములైన కళ్యాణ గుణములు మాత్రమే కాదు ఇంకను అనేక గుణములు కలవు అని సమన్వయము చేసిరి.

శ్వేతాశ్వతరోపనిషత్‌లో పరమాత్మను గుణీయని, పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికే జ్ఞాన బల క్రియాచ అని స్వాభావికములైన జ్ఞాన బలాదులు కలవాడని చెప్పబడినది. ముండకోపనిషత్తునను "యస్సర్వజ్ఞస్సర్వవిత్" అని ఆయన సర్వజ్ఞత్వము చెప్పబడినది. కాని శ్వేతాశ్వతరము నందే "సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ" అని నిర్గుణత్వము చెప్పబడినది. కావున పూర్వోక్త సగుణ శ్రుతులను ఇది నిషేధించుచున్నది అనునది పూర్వపక్షము.

కానీ భగవద్రామానుజులు వానికి ఏకవాక్యతను గూర్చిన విధము పరికింతము. ఛాందోగ్యములోని "అపహత పాప్మావిజరో విమృత్యుర్విశోకో విజిఘిత్సః అపిపాసః - సత్యకామః సత్య సంకల్పః అను ఒకే శ్రుతి వాక్యములో పరమాత్మ పాపము, ముసలితనము, మృత్యువు, శోకము, ఆకలి, దప్పిక లేనివాడని (హేయగుణములు లేనివారని) చెప్పి సత్య కామ, సత్యసంకల్ప

ఇత్యాది కళ్యాణ గుణములు కలవాడనియు చెప్పుచున్నది. ఇట్లు ఒకే కావ్యమునందు హేయ గుణరహితుడని కళ్యాణగుణసంపన్ను డని యెట్లు చెప్పబడినదో అట్లే 'పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే' ఇత్యాది శ్రుతివాక్యములు కళ్యాణ గుణములు కలవాడని; 'కేవలో నిర్గుణశ్చ' ఇత్యాది వాక్యములు హేయగుణములు లేనివాడని చెప్పుచున్నవి. ఈవిధముగా పై 'అవహత పాప్మాది' వాక్యము సగుణ నిర్గుణ శ్రుతుల సమన్వయము చేయుటచే ఇట్టి వానికి ఘటక శ్రుతులని పేరు వచ్చినది.

ఈ విధముగా భగవద్రామానుజులు సగుణ నిర్గుణ శ్రుతుల కు ఘటక శ్రుతుల మూలమున సమన్వయము చేసి సగుణ నిర్గుణ శ్రుతివాక్యములన్నియు ప్రమాణము లేదని నిరూపించుటయేకాక పరమాత్మ 'అఖిలహేయ ప్రత్యనీక కళ్యాణైక తానస్వేతర సమ స్త వస్తువిలక్షణానంత జ్ఞానానందైక స్వరూపుడని సిద్ధాంతీకరించిరి.

భేదాఽభేద శ్రుతి సమన్వయము:.... భేదశ్రుతులు వ్యవహారిక భేద మును తెలుపును. (తత్త్వజ్ఞానోదయ పర్యంతము ఉండు జ్ఞానము వ్యవహారిక జ్ఞానము. అనగా చీకటిలో తాడును చూచి పాము అని భయపడి వెలుగులో చూచిన పిమ్మట అదితాడు అని తెలిసికొని అంతకు ముందుగల పాము అను భావము పోగొట్టుకొన్న విధము గా తత్త్వజ్ఞానోదయమైన పిమ్మట నశించును. ఇక అభేదశ్రుతులు పారమార్థిక త్రికాల బాధిత సత్యమును తెలుపునని కొందరి ఆచా ర్యుల అభిప్రాయము. కాని ఇది సరికాదు. "నేహ నానాస్తి కించ న" 'మృత్యోః సమృత్యు మాప్నోతియ ఇహ నా నేవ పశ్యతి' ఇ త్యాది వాక్యములు భేదము లేదని భేదజ్ఞానము సంసార హేతువ ని చెప్పుచున్నవి గదా అన్నచో అదియు సమంజసము కాదు. "మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ!" అని చెప్పినట్లు గా జగత్తంతయు బ్రహ్మచేత బ్రహ్మనుండి పుట్టినది. బ్రహ్మ అం

తర్యామిగా గలది. కావున బ్రహ్మాత్మకము. దానిని పరమాత్మ కంటె భిన్నముగా తలంపరాదు అని పైశ్రుతివాక్యమునకు అర్థము కాకున్న "బహుస్యాం ప్రజాయేయ" అను శ్రుతి వాక్యము నిరోధించును గదా! ఈ భేదము శరీర శరీరి భేదమని గ్రహింపవలెను. 'యస్యాత్మా శరీరం, యస్య పృథివీ శరీరం, తత్సృష్ట్వా' ఇత్యాది వాక్యములు పరమాత్మ చేతనా చేతనములు శరీరముగా కలవాడనియు, 'స ఆత్మా' 'ఆత్మనే నాప్రవిశ్య' "అన్తః ప్రవిష్టశ్శాస్తా" "తదను ప్రవిశ్య" ఇత్యాది శ్రుతులు సమస్త చేతనా చేతనములకు నియామకుడై పరమాత్మ ధరించియున్నాడని శరీర శరీరి భావము ను ప్రతిపాదించు చున్నవి.

ఈ విధముగా భగవద్రామానుజులు సగుణశ్రుతులకు సమస్త కళ్యాణ గుణాకరుడని; నిర్గుణ శ్రుతులకు హేయగుణ రహితుడని; నిర్వికార శ్రుతులకు స్వరూపతః పరిణామము లేనివాడని; భేద శ్రుతులకు సమస్త చిత్ అచిత్ వస్తు విశేషణ సహితుడని; అభేద శ్రుతులకు సమస్త చేతనా చేతనములు శరీరముగాగల శరీరి యని పరబ్రహ్మను నిష్కర్షించి ఆతడే శ్రీమన్నారాయణుడని; శ్రియః పతియని; పుండరీకాక్షుడని నిరూపించి శ్రుతి వాక్యములకు ఏక వాక్యతను గూర్చిరి.

"భాష్యేద్వే శ్రీమహచ్ఛబ్ద భూషితే శేషభాషితే" అను నటుల శ్రీభాష్య మహాభాష్యములు రెండింటికి కర్త ఆదిశేషులేయని ఆ భాణకము "అనంతః ప్రథమం రూపం" అనియు; 'శేషమూర్తిం' అనియు 'భుజంగం వపురపహాయ' అనియు భగవద్రామానులను ఆదిశేషులుగా వర్ణించిరి. ఈ విధముగా ఉపనిషద్వాక్యముల కేకవాక్యత కూర్చి ఆదిశేషులని ప్రసిద్ధి పొందిరి.

విష్వక్సే నావతారమనుటః....

"శ్రీమతి విష్వక్సేనే న్యస్త సమస్తాత్మైశ్వరం" అనియు

'యద్వేత్రి శిఖరస్పందే విశ్వమే తత్వ్యవస్థితమ్' "విన్యన్య విశ్వ చిదచిన్న యనాధికారన్" అనురీతిని సర్వేశ్వరుడు తన సామ్రా జ్యాధికారము నంతయు (ఉభయ విభూతుల యధికారము) విష్వ క్సేనులపై నుంచినాడు

సర్వేశ్వరుడు ప్రళయార్ణవ మగ్నులైన చేతనులకు కరణ కళేబరప్రదానము గావించి 'హానం ప్రదీపమివ కారుణికో దదాతి' అనునట్లు దయతో శాస్త్రమును ప్రసాదించినను; దాహమునకై త్రవ్విన నూతిలోపడి మరణించిన వానివలె అల్పాస్థిర ప్రదాతలగు దేవతాంతరముల భజించియు; 'కింతేన నకృతం పాపం చోరేణాత్మ పహారిణా! అనునట్లు ఆత్మాపహారము గావించియు, అధర్మప్రవర్త నులై 'పలపిఅప్పం పిఅన్దు' అనునట్లు పలుగర్భ వాసములందు జన్మించి వ్యర్థులైన చేతనులను జూచి వీరిగతి యేమి అనివగచి తన సౌలభ్యమును ప్రకాశింప జేయు రామకృష్ణా ద్యవతారములను ధరించెను. కానీ అవియు వ్యర్థములయ్యెను 'అవజానంతి మాం మూ ఢాః' అని తానే వాపోయినట్లు ఆయన సర్వభూతాంతరాత్మయని, సర్వస్వామియని గుర్తింపరయ్యెను. అయినను ఆయన మనలను విడనాడక 'ఏజాతి మృగముల నాజాతి మృగముల ద్వారా బంధిం పవలయు' నను న్యాయమున తన పరివారమును ఆళ్వారులుగా ఆచార్యులుగా నవతరింపచేసెను. అట్లవతరించినవారే భగవద్రామా నుజ మునీంద్రులు. వీరు అవతరించునపుడే సర్వేశ్వరుడు వీరికి ఉభయ విభూతి నాయకత్వమును ప్రసాదించెను. ఉభయ విభూతు లు యనగా నిత్యవిభూతియగు పరమపదము లీలా విభూతియనబ డు తక్కిన లోకములు. వీనిపై యధికారమును రామానుజులవారికి ప్రసాదించెను. ఈ అధికారములతో అవతరించిన ఎంబెరుమానారు లు సకల చేతనోజ్జీవన భారమును తామై వహించిరి. ఈవిషయము నే మణవాళ మహామునులు "కాలత్రయేపి" అను యతిరాజవింశతి శ్లోకమునందు వెల్లడించిరి. మనము కాలత్రయములందు కరణ

త్రియములచేత చేయుపాపములకు మేరలేదు. ఆ పాపము ప్రాయ శ్చిత్తాదుల వలన పోవునవి కావు. భగవంతుని కృపయే వానిని ప్రక్షాళన చేయగలదు. అక్షమను మనకై ప్రార్థించిన వారు భగవ ద్రామానుజులు. సర్వేశ్వరునిదైన చేతనా చేతన రక్షణభారమును వీరు వహించుటచే వీరు విష్వక్సేనుల యవతారమని చెప్పవలెను. శ్రీమద్వేదాంత దేశికులును

విష్వంత్రాతుం విషయ నియతం వ్యంజితాను గ్రహస్సన్
విష్వక్సేనో యతిపతిరభూత్ వేత్రసారః త్రిదండః

అని విష్వక్సేనులు భగవద్రామానుజులై యవతరింపగా వారి వేత్ర దండము త్రిదండముగా అయినదని స్తుతించియున్నారు.

పంచాయుధా వతారమనుట:....

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

అని సర్వేశ్వరుడే తన అవతార ప్రయోజనమును వివరించెను. 'అజాయ మానో బహుధా విజాయతే' అని కర్మవశ్యమైన జన్మ ము కాకపోయినను మనకై కృపతో యనేక విధంబులుగా నవత రించుచున్నాడు. అంతేకాదు

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థా నమధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥

అని ధర్మము నశించినపుడు అధర్మము పెరిగినపుడు తనను సృజిం చు కొందునని చెప్పెను. సంభవామి-సృజామి (సంభవింతును_ సృజింతును) అనుటచే తానై జన్మింతుననియు తనవారిని (సృజిం ప) జన్మింప చేతుననియు చెప్పనచ్చును. ఆ విధముగా అవతరిం చిన వారే భగవద్రామానుజులు. కనుకనే కృష్ణావతారమును గూర్చి "దేవకీ పూర్వసంధ్యాయాం ఆవిర్భూతం మహాత్మనా" అనినట్లుగనే 'శ్రీమాన్ ఆవిరభూత్ భూమౌ రామానుజ దివాకరః' అని భాష్యకారుల అవతారమును దివాకర ఆవిర్భావముగ చెప్పిరి.

'సురద్విషాం ప్రాణవినాశి' అనియు ,యస్య ధ్వనిర్దానవ దర్పహంతా' అనియు ,రక్షో సురాణాం కఠినాగ్రకంఠ చ్ఛేదక్షరత్ శోణిత దిగ్ధసారం' అనియు ,దైత్యాఽశనిపాత వర్షైః దైత్యకులైక హంత్రీం' అనునట్లుగా పంచాయుధములు ఆసుర ప్రకృతులైన దైత్య దానవ, అసుర రాక్షసాదులను సంహరించునవి. సుదర్శనమూర్తి శిశుపాలుని కూల్చినది; బాణాసురుని బాహువులను ఖండించినది. శంఖము ధార్తరాష్ట్రుల హృదయమును చీల్చెను. శార్ఙ్గము రావణుని తలను కూల్చెను. పౌండ్రకుడగు కాశీరాజుతోడి యుద్ధమున కాశీనగరమును తగులపెట్టెను. ఇట్లు అసురులను నిర్జించుటయేగాక పరమభాగవతుడగు అంబరీషుని దుర్వాసమహర్షి నుండి రక్షించెను. సైంధవవధకై సూర్యుని అడ్డుకొని అర్జునునకు సహాయము చేసెను. ఈ విధముగా పంచాయుధములు దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసినవి. భగవానుడు జీవకోటిని రెండు వర్గములుగా చేసినాడు దైవీసంపదగలవారు, ఆసుర సంపద గలవాగు. దైవసంపద గలవారనగా భగవద్భాగవతాచార్య కైంకర్యనిరతులు. అసురసంపద గలవారనగా 'ఈశ్వరోఽహ మహంభోగీ' అను విధమున గర్వోన్మత్తులై సాధువుల విషయమై అపచార మొనర్చువారు. ఆ అసురప్రకృతులే పలురూపముల నుందురు. భగవానుడే లేడనువారు; ఉన్నను వానికి స్వరూప గుణవిభూతులు లేవనువారు. భగవానుని అనుమానముచే సాధించినవారు: సర్వశూన్యవాదులు ఇట్లు వీరందరు భగవద్వైభవమును నిరసించువారే!

భగవద్రామానుజులు అవతరించి ఆసురీ ప్రకృతులను జయించిన విధమును ,శారువాగమతం నీరుశెయ్‌దు' అను పాశురమున మామునులు చక్కగ అనుగ్రహించిరి. చార్వాక, జైన, బౌద్ధ, కణాద, పాశుపత మొదలగు వేదబాహ్యులను జయించినారు. ,శమితోదయ శంకరాది గర్వః స్వబలాదుధృత యాదవ ప్రకాశః, అనియు ,,పాషాండ ద్రుమషండదావ దహనః" ఇత్యాదిగను వారి

కుమతీ నిరసన స్తుతింప బడుచున్నది.

ఈ విధముగా భగవద్రామానుజులు భగవద్వైభవమును పఠింపని అసురీ ప్రకృతులను జయించుటేగాక వారిని భగవద్వైభవ పరిరక్షకులుగా చేసిరి. (యాదవ ప్రకాశులు, యజ్ఞమూర్తి మున్నగువారి వృత్తాంతములను స్మరించునది) భగవత్ కైంకర్యైక నిరతులైన శ్రీ కూరత్తాళ్వాన్, మొదలి యాండాన్, మున్నగు ఆచార్యులను అనుగ్రహించి చతుఃసప్తతి సింహాసనాధీశుల నేర్పఱచి దర్శన ప్రకర్తకులైరి. ఈ విధముగా కుమతి నిరసన ఆశ్రిత సంరక్షణ చేయుటచే భగవద్రామానుజులు పంచాయుధావతారమనియే చెప్పవలెను. ఈ విషయమునే తిరునరంగత్తు ముదనారులు 'అడైయార్ కనులత్తి' అను పాశురమున వివరించియున్నారు. శ్రీమన్నిగమాంత మహాదేశికులును యతిరాజ సప్తతిలో

ప్రథయ న్విమతేషు తీక్ష్ణభావం ప్రభురస్మత్పరి రక్షణే యతీన్ద్రః।
అపృథక్ప్రతి పన్నయన్మయత్వైః వవృధే పంచభి రాయు ధైర్మురారేః॥

అనియు స్వామిని పంచాయుధావతారముగా అభివర్ణించియున్నారు.

ప్రథమాచార్యుడై సకల చేతనోజ్జీవన భారమును వహించినవాడు శ్రీమన్నారాయణుడు. ఆదిలో బ్రహ్మకు వేదముల నుపదేశించెను. మరల తానే 'వ్యాసాయ విష్ణురూపాయ' అనునట్లు వేదవ్యాసులుగా నవతరించి వేదవిభాగము చేయుటయేగాక బ్రహ్మసూత్రములను అనుగ్రహించెను. "వక్తా పాంచరాత్రస్య యస్యయమ్" అనునట్లు పాంచరాత్రాగమమును ప్రసాదించెను. తానే నరనారాయణ రూపమున శిష్యుడు ఆచార్యుడునై తిరుమంత్రమును; లక్ష్మీదేవికి ద్వయ మంత్రమును; వరాహావతారమున భూదేవిని; శ్రీరామావతారమున విభీషణుని; శ్రీకృష్ణావతారమున అర్జునుని నిమిత్తముగా చేసికొని చరమ శ్లోకములను ప్రసాదించెను. అం

తేకాక సకలోపనిషత్సారమైన గీతాశాస్త్రము నుపదేశించి, గీతాచా ర్యుడనియు; జగద్గురువనియు ప్రసిద్ధి వహించెను. 'శాస్త్రం ప్రదీప మివ కారుణికో దదాతి' యనునట్లు కారుణ్యముతోనే మనకు శాస్త్ర దీపము నొసంగి ఆచార్యుడయ్యెను. కావుననే 'లక్ష్మీనాథ సమా రంభాం' అనియు 'ఆద్యం గురుం వందే కమలా గృహమేధినమ్' అనియు తొలి ఆచార్యుడుగా స్తుతింపబడుచున్నాడు.

ఇట్టి ఆచార్యపూర్తి సర్వేశ్వరునకు తరువాత భగవద్రామాను జులకే కలదు.

ఆచినోతిహి శాస్త్రార్థాన్ ఆచారే స్థాపయత్యపి।
స్వయమాచరతే యస్మాత్తస్మా దాచార్యవాక్ భవేత్॥

అను రీతిని శాస్త్రాధ్యయనంచేసి తానాచరించి ఆచరింపచేయుటచే ఆచార్యుడనియు, "జ్ఞాన మనుష్ఠానమివై నన్ఱాగవేయుడయ నాన గురవయ్యైడెన్దు" అనునట్లు జ్ఞానానుష్ఠానములున్నవారే ఆచార్యులని యు, శాస్త్రసిద్ధమైయున్నది. ఈ ఆచార్య లక్షణములను గూర్చిన ఈ క్రింది శ్లోకమును పరికింతము.

సిద్ధం సత్సంప్రదాయే స్థిర ధియమనఘం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం
సత్త్వస్థం సత్యవాచం సమయనియతయాం సాధు వృత్త్యా సమేతమ్।
డంబాసూయా విముక్తం జితవిషయగణం దీర్ఘబంధుం దయాళుమ్
స్ఖాలిత్యే శాసితారం స్వపరహితపరం దేశికం భూష్ణురీప్సేత్॥

(సత్సంప్రదాయ సిద్ధుడు, స్థిరబుద్ధి కలవాడు, ఉపదేశ ఫలాదుల విషయమున దోషరహితుడు, వేదాంత శాస్త్రమును చక్కగ తెలిసిన వాడు, భగవదేక నిష్ఠగలవాడు, సత్త్వ గుణ సంపన్నుడు, సత్యము నే పలుకువాడు, మంచి ఆచారము కలవాడు, డంబము, అసూయ లేనివాడు, విషయభోగములను జయించినవాడు, దీర్ఘ బంధువు ద యాళువు, అపమార్గము నందున్నపుడు శిక్షించువాడు, తనకు ఇత రులకు హితపరుడునగు ఆచార్యుని ఆశ్రయింపవలెను.) అనిగద పూర్వాచార్యోక్తి. 'పితాక నారయుడైయపిరానార్ పిరమగురు వా

ష్ణువు (పీతాంబరుడే పరమగురువై వచ్చి) అనియు "సాక్షాత్ నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్। మగ్నాన్ ఉద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా" అనియు ఇత్యాది ప్రమాణములచే సాక్షాత్ శ్రీమన్నారాయణుడే ఆచార్యుడై అవతరించునట్లు శాస్త్రము తెలుపుచున్నది. అట్టి ఆచార్యులు భగవద్రామానుజులే అని చెప్పవలెను. దీనినే "తస్యాః సంభావినః శిష్యాః సురాణామపి దుర్గమమ్" అని స్కాంద పురాణవచనము ధృవపరుచుచున్నది.

ఆచార్యులు అనువృత్తి ప్రసన్నాచార్యులు; కృపామాత్ర ప్రసన్నాచార్యులు అని ద్వివిధము. మన ప్రణిపతన పరిప్రశ్న సేవాదులచే ఆశ్రయించిన "సద్బుద్ధి సాధుసేవీ" ఇత్యాది శ్లోకోక్తమైన లక్షణములు కలిగిన శిష్యుని పరీక్షించి తగినవాడైనచో బ్రహ్మజ్ఞానమును పదేశించువారు అనువృత్తి ప్రసన్నాచార్యులు. అట్లుగాక చేతనుల స్థితిని చూచి అయోగ్య అని కరుణించి "అకిలుమ్ శొల్లనన్ కేణ్మినో" అనునట్లు మనము కోరకున్నను పిలచి హితమునుపదేశించువారు కృపామాత్ర ప్రసన్నాచార్యులు. భగవద్రామానుజులు కృపామాత్ర ప్రసన్నాచార్యులు. "దయాంచిత దృగంచలం" అనునట్లుగా వారికృప అవధిలేనిది. "నిగమ జలధికేలా పూర్ణచంద్రో యతీంద్రః" అని దేశికులవారను గ్రహించినట్లు చంద్రునిలోని చల్లదనము చేతనులందరిపై కురిపించినారు. వారిపర సమృద్ధి ప్రియత్వము అవధిలేనిది. కానిచో మనకు తిరుమంత్రార్థము లభించెడిది కాదు. సర్వేశ్వరుని పరత్వమును ప్రకాశించెడిదికాదు. కొండపై వర్షించిన వర్షము సముద్రమును చేరువరకు అనేక రీతుల ప్రవహించి; ఊషర క్షేత్రములను సైతము సస్యశ్యామలము చేయునట్లు వారి కృపనేటికిని మనవంటి వారియందు ప్రవహించుచునే యున్నదిగదా!

ఇంతటి కృపామూర్తులు గనుకనే సర్వేశ్వరుడు గావించిన

ఆచార్యకృత్యములను ఘనవరకు తీసికొని వచ్చిరి. సర్వేశ్వరుడ నుగ్రహించిన వేదమును ప్రమాణముగా నంగీకరించి వేదవాక్య ముల కేకవాక్యత గూర్చి వేదప్రామాణ్యమును వెల్లడించిరి. వేద వ్యాస భగవానులనుగ్రహించిన బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యా నముగా శ్రీభాష్యము ననుగ్రహించిరి. అంతేగాక వేదార్థ సంగ్ర హముద్వారా వేదార్థమును నిష్కర్షించిరి.

సర్వేశ్వరుడను గ్రహించినది అష్టాక్షరీ మహామంత్రము; శిష్టజన పరిగృహీతము; అర్థపూర్తి కలిగిన యీ మంత్రమును సర్వు లకు ఉపదేశించియు, తమ తరువాత ఆచార్యులు ఉపదేశించునట్లు శాసించిరి. అదేవిధముగ ద్వయమంత్రార్థమును వెల్లడించిరి.

భగవానుడు గీతాచార్యుడై యవతరించి అనుగ్రహించిన భగవద్గీతకు భాష్యమునుగ్రహించి జగదాచార్యులైరి. పాంచరా త్రాగమమును హృదయము నందిడుకొని నిత్యగ్రంధమను 'తిరు వారాధన' (ఆరాధన) గ్రంధమును అనుగ్రహించిరి.

ఇట్లు సర్వేశ్వరున్ని ద్వారా ప్రవేశించిన వానిని రక్షించుట యే గాక, సకల చేతనుల ఉజ్జీవనకై శరణాగతి గద్యమును; భూ లోక వైకుంఠమైన శ్రీరంగమున రంగనాధుని వైభవమును ప్రకా శింపచేయు శ్రీరంగ గద్యమును, పరమపద వైభవమును ప్రకాశిం పచేయు శ్రీవైకుంఠ గద్యము ప్రసాదించిరి.

ఈ విధముగా సంస్కృత వేదాంతమును పరిరక్షించ్న భగ వద్రామానుజులు ద్రావిడ వేదాంతమునకు కూడ రక్షకులైరి. ఆళ్వా ర్లనుగ్రహించిన నాలాయిర దివ్యప్రబంధములను వేదముతో సమా నమైన ప్రమాణముగా నంగీకరించిరి నమ్మాళ్వార్ అనుగ్రహిం చిన తిరువాయిమొళికి 'తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్' అను తమ శిష్యులచేత 'ఆరాయిరప్పడి' అను వ్యాఖ్యానమును అవతరింప

చేసిరి. తిరువాయిమొళికి కన్నతల్లి నమ్మాళ్వారైన పెంచిన తల్లి భగవద్రామానుజులని "ఈన్టముదల్ తాయ్ శడగోపన్మొయ్మ్బాల్ నళర్త్త యితత్తాయ్ ఇరామానుశన్" అని పేరు పొందిరి. ప్రతి దివ్య స్థలమునను ఆళ్వార్ల దివ్యప్రబంధముల అధ్యయనము జరుగున ట్లు నియమించిరి. సంస్కృత వేదాంతముతోపాటు ద్రవిడ వేదము నుకూడ తప్పక అధ్యయనము చేయవలెనని నియమనము చేసిరి. వారి నియమానుసారమే మనమా దివ్యప్రబంధములను అధ్యయన ము చేయుచు ఆ అధ్యయనశక్తిని మనకు ప్రసాదింపుమని 'ఎయ్ న్దపెరుం కీర్తి ఇరామానుశమునితన్' అనియు 'ఎఙ్గళ్గదియే ఇరా మానుశమునియే' అనియు వారిని ప్రార్థించుచున్నాము. కావున నే మణవాళ మహాములు 'ఆళ్వార్గళ్ తాంగళ్ అవదరిత్తనాళ్ గళిలుమ్ వాళ్వావనాళ్ నమక్కు మణ్గులగిర్' ఓ లోకులారా! ఆళ్వార్లు అవతరించిన దివసములకంటె భగవద్రామానుజులు అవత రించిన యీ దినము మంగళకరమైనది! అని స్తుతించిరి.

ఈ విధముగా భగవద్రామానుజులు శ్రీరామచంద్రులను గ్రహించిన అభయప్రదానమును వివరించుటచేతను, గీతాభాష్య ము ననుగ్రహించి చరమ శ్లోకార్థమును ప్రకాశింప చేయుటచేతను శ్రీభాష్య వేదాంతదీప వేదార్థసంగ్రహముల ద్వారా వేదార్థమును, ఋషిప్రోక్తములైన ప్రమాణములను ప్రకాశింప చేయుటచేత; నమ్మా ళ్వార్లనుగ్రహించిన చతుః ప్రబంధములు చతుర్వేదములుగా; తిరు మంగై ఆళ్వార్లు అనుగ్రహించిన షట్ప్రబంధములు వేదాంతము లుగా, మిగిలిన ఆళ్వార్ల దివ్యప్రబంధములు ఉపాంగములుగా ఆద రించి ప్రకాశింపచేయుటచేతను; గద్యత్రయమును అనుగ్రహిం చుట చేతను; విమత నిరసనము, విశిష్టాద్వైత సిద్ధాన్త స్థాపనచేసి శ్రీరంగనాథులచే ,,ఎంబెరు మానార్ దర్శనము" (రామానుజమత ము) అని ప్రసిద్ధినొందుటచేతను వీరు ఆచార్యాగ్రగణ్యులై సర్వే శ్వరుని అపరావతారమని పేర్కొనతగియున్నారు.

ఏవంచ భగవద్రామానుజులు ఆదిశేషులనియు; విష్వక్సేనులనియు, పంచాయుధములనియు; శ్రీమన్నారాయణుడే అనియు వారి ప్రభావమును బట్టి చెప్పవలసియున్నది. వీరు సర్వేశ్వరునకు ఆపద్ధనమని పెద్దలు సాయింతురు. ఇట్టి భగవద్రామానుజ అవతారవైభవమును మనము స్మరించి వారి కృపకు పాత్రులు కావలసినదిగా కోరుచున్నాడను.

శేషోవా సైన్యనాథోవా శ్రీపతిర్వేతి సాత్త్వికైః।
వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మఙ్గళమ్॥



# భగవద్రామానుజ వైభవము

కడలళవాయ తిశైయెట్టినుళ్లుం కలియిరుళే
మిడతరు కాలత్తు ఇరామానుశన్; మిక్క నాన్మఱైయిన్
శుడరొళియాల్ అవ్విరుళైత్తు రిన్దిలనేల్ ఉయిరై
యుడయవన్ నారణనెన్ఱఱి వారిల్లై ఉత్తుణర్న్దే॥

నాల్గుసముద్రములు అష్టదిక్కులు అవధిగాకలిగి కలిప్రాబల్యమున అజ్ఞానాంధకారము వ్యాపించిన ఈ లోకమున ఈ కాలమున భగవద్రామానుజులు ప్రమాణమూర్ధన్యమైన చతుర్వేద సారమను తేజస్సుతో ఆ చీకటిని పారద్రోలనిచో శ్రీమన్నారాయణుడే పరతత్వము అను విషయము తెలిసికొనేవారే లేరుగదా!

ఈ పాశురము వలన శ్రీమన్నారాయణుడే సర్వస్మాత్పరుడని; ఆ విషయమును మనకు తెలియపఱచినవారు భగవద్రామానుజులని; అందులకు వారికిగల సాధనము చతుర్వేదములని; వారు అవతరించిన పిమ్మటనే కలి ప్రాబల్యము వలన కలిగిన అజ్ఞానాంధకారము నశించినదని తెలియుచున్నది.

ప్రపన్న జనకూటస్థులైన నమ్మాళ్వార్లు (పరాంకుశ మునీంద్రులు) తిరువాయి మొళిలో (5–2–1)లో భగవద్రామానుజులవతరించుటను; వారి అవతారము వలన కలిప్రాబల్యము నశించుటను సూచించియున్నారు.

ఆచార్యానుగ్రహము లేనిదే భగవదనుగ్రహము లభింపదు "తప్పిల్ కురువరశాల్ తామరయాళ్ నాయకన్దన్; ఒప్పిలడిగళ్ నమక్కుళ్లత్తువైప్పెన్దు" (దోషరహితులైన ఆచార్యుల అనుగ్రహము వలననే మన హృదయ నిక్షేపమున గల భగవంతుని తెలుసుకొంటిని) అనునట్లుగా భగవద్రామానుజుల వారిచేతనే భగవద్వైభవము ప్రకాశింప చేయబడినది. రత్నమెంత కాంతివంతమైనను,

మూల్యము కలదైనను బేహారి చూపింపక కనబడనట్లు ఆచార్యాను గ్రహము లేనిదే భగవంతుని పొందజాలము. మనము నడుచు త్రోవలో లేక మనయింటిలో నిధియున్నను మనకు తెలియక భూగర్భ విజ్ఞానముగల శాస్త్రవేత్తగాని లేక కనులకు అంజనమును పూసికొని వస్తువులను జూచు సిద్ధుడుగాని; మనయింటికివచ్చి ఆనిధి రహస్యములను పదేశించినట్లుగా, సర్వులకు నిధివలె నున్న సర్వే శ్వరుని తెలియజేసిన మహాచార్యులు శ్రీరామానుజ గురుసార్వ భౌములు. కావున వారి విషయమునవే 'తస్మిన్ రామానుజాచార్యే గురురితపదం భాతి' అనురీతిని గురుశబ్దము ప్రకాశించుచున్నది. అనగా భగవచ్ఛబ్దము శ్రియఃపతియగు శ్రీమన్నారాయణుని యం దే రూఢమై తక్కిన వారియందు ఔపచారిక మగునట్లు గురుశబ్దము ను భగవద్భాష్యకారుల యందే రూఢమై తక్కినవారి యందు ఔప చారిక మగుచున్నది.

అయినచో 'లక్ష్మీనాథసమారంభాం' అనునట్లుగా ప్రథమా చార్యులై, అష్టాక్షరీ మహామంత్రమును(నరునకు) ద్వయమంత్రి మును(లక్ష్మీదేవికి) ఉపదేశించియు; పార్థుని నిమిత్తముగా చేసికొని గీతాశాస్త్రమును అవతరింపచేసి గీతాచార్యుడనియు ప్రసిద్ధివహిం చిన శ్రీమన్నారాయణుని యందును గురుశబ్దము ఔపచారికమేనా? అందుకు, ఔననియే చెప్పవలెను. ఎట్లనగా, శ్రీమన్నారాయ ణుడు ప్రథమాచార్యుడై ఉపదేశించినది తిరుమంత్రము. (అష్టాక్షరి.) ఈ మంత్రమును తానే శిష్యుడు, ఆచార్యుడునై అనునట్లుగా తన సృష్టిలో తనకు తగిన శిష్యుడు లభింపక పోవుటచే (తాను వండు కొన్నది తనకే రుచించనట్లు) తానే శిష్యుడై నరునిగా యవతరించి సకల చేతనోజ్జీవనార్థమై తిరుమంత్రమును ఉపదేశించెను. ఇచట తన కంటె భిన్నుడుగాని తనయవతారమే అయిన నరునకు ఉపదే శించుటచే తగిన శిష్య సంబంధము లేకపోయెను. శిష్యుడున్న గదా! ఆచార్యుడను వ్యవహారము. శిష్యుడే లేనియపుడు ఆచార్య

డనుట ఎట్లు పొసగును? పిమ్మట ఉపదేశించినది ద్వయమంత్ర ము. లక్ష్మీదేవికి ఈ మంత్రమును ఉపదేశించెను. "విష్ణోరేషాన పాయినీ" అనునట్లు ఎపుడు గాని సర్వేశ్వరుని వీడియుండక వారి వక్షస్థలముననే వేంచేసియుండి ద్వయమంత్రార్థమును అనుష్ఠాన పర్యంతము గల లక్ష్మీదేవికి, అందునా లక్ష్మీ సహితమైన మంత్ర మును ఉపదేశించుటవలన అచటను తగిన శిష్యుడు లభింపలేదు.

ఇక శ్రీరామచంద్రుడుగా నవతరించి "సకృదేవ ప్రపన్నా య." అను చరమశ్లోకమును అనుగ్రహించి నందులకు ఆచార్య డందమా అనినను అదియు పొసగుటలేదు. విభీషణుడు శరణుపేడ గా దోషియగు రావణుని తమ్ముడగుటచే శరణము నీయవలదని సుగ్రీవాదులు; నిర్దోషియగుటచే శరణము నీయవలసినదని హను మయు పలికినను శ్రీరామచంద్రుడు తనదైన విశిష్ఠమార్గము సను సరించి "దోషోయద్యపి తస్యస్యాత్" "యదివా రావణ స్స్వయ మ్" అని ఈ సుగ్రీవునిలో దోషముబున్నను, లేక రావణుడే వచ్చినను అభయము నిత్తునని గదా పలికెను. ఆ పలుకులు విభీష ణుని ఉద్దేశించి మాత్రమే పలికినవి కావే! సుగ్రీవ హనుమదాదు లనుద్దేశించిగదా పలికినవి కానీ ఆ మాటలు సముద్రఘోషలో కల సి పోయునవి. కానిచో 'నాన్యృగ్వేద వినీతస్య" ఇత్యాదిగ శ్రీరామ చంద్రుని ప్రశంసకు పాత్రుడై శ్రీరామమంత్ర జపతత్పరుడై; "దాసోఽహం కోసలేంద్రస్య రామస్య" అని తానే చెప్పినట్లు రామదాసుడై; 'అనృశంస్య పరోధర్మః' అను శ్రీరామవచనము ను సీతాదేవి వలన విన్నవాడై; ఇపుడు 'దోషోయద్యపి' అనియు, 'యదివా రావణస్స్వయం' అనియు శ్రీరాముని హృదయమును తెలిసికూడ హనుమ రావణ వధానంతరము అశోక వనమునగల రాక్షసస్త్రీలను సంహరించుటకు సీతాదేవి అనుమతిని కోరెనే! ఇది తగునా? ఇదియేనా ఆచార్యవైభవమును ప్రకాశింప జేయువిధము? ఆ సమయమున సీతాదేవి "కార్యం కరుణ మార్యేణ" అని పలుకని

చో ఆ రాక్షసస్త్రీల గతియేమయ్యెడిది? ఇట్టి శిష్యుడుగదా లభించి నాడు.

కృష్ణావతారమును పరిశీలింతము. రాబోవునది కలియుగము; క్రూరమైనది. ఈ సంసారుల గతి ఏమి కానున్నది యని చింతించి ఇంతకు పూర్వమే యవతారమునందు ప్రసాదింపని రీతిగా గీతా శాస్త్రము నుపదేశింప బూనెను. యుద్ధభూమిలో ఆ సమయమున పార్ధునకు నిర్వేదముకలిగించి, దానని రూపుమాపుటకు అనుమిషతో మనకై గీతాశాస్త్రము నుపదేశించెను. అచట శిష్యుడు అర్జునుడు. "పాండవానాం ధనంజయః" 'అర్జునః కేశవస్యాత్మా" 'మమ ప్రాణాహి పాండవాః' అని తానే చెప్పినట్లు ఆ శాస్త్రమును తనకు ప్రాణమగుటచే తానే అయిన అర్జునునకుకదా ఉపదేశించెను. లేక అర్జునుని పాండవ మధ్యమునిగా భావింతుమనినను ఆ అర్జునుడు చేసినదేమి? తానీ గీతాశాస్త్రమును ఎట్టివారికి ఉపదేశింప కూడదని చెప్పెనో అట్టి లక్షణములు అతనిలో కలవు కదా! కాకున్న "కథమేతత్ విజానీయాత్" అని ప్రశ్నించునా? అంతేకాదు ఆ ఉపదేశమంతయు యుద్ధఘోషలో కలసిపోయినట్లు యుద్ధానంతరము కృష్ణా! మరచితిని మరల యుపదేశింపుము అని ప్రార్థించునా? ఇక తానును ఉపదేశించునపుడు "మూఢాః" అనియు, 'నరాధమాః' అనియు దూషణలతోనే కదా ఉపదేశించినది.

(N. B. ప్రమేయము భగవద్రామానుజ వైభవముగాని భగవద్వైభవ నిరసనము కాదని గ్రహింపప్రార్థన.)

ఈ విధముగా సర్వేశ్వరుడు తాను చేసిన ప్రయత్నము గురుత్వము వ్యర్థమయ్యెను. గురుత్వమే కాదు శిష్యత్వముకూడ వ్యర్థమయ్యెను.

శ్రీరాముడుగా నవతరించి విశ్వామిత్ర యాగ సంరక్షణార్ధమై వేంచేసి "ఇమౌస్మ మునిశార్దూల కింకరౌ సముపస్థితౌ" అను

నట్లు కైంకర్యము (సేవ) చేసియు పిమ్మట జనకపురిలో శతానం దులవారి వలన విశ్వామిత్ర చరిత్ర విని అయ్యో! ఇట్టి రాజస గుణోపేతునకా శిష్యులమైతిమని వాపోయెనట. "సుగ్రీవం శరణం గతః", "సుగ్రీవం నాథ మిచ్ఛతి" అనునట్లు సుగ్రీవునాశ్రయిం చినను ఆ సంబంధము "నచ సంకుచితః పంథాయేనవాలీ హతో గతః" "మావాలి పథమన్వగా" (వాలిపోయిన మార్గము మూయ లేదు-వాలిపోయిన మార్గమున పోకుము) అనునంతవరకు వచ్చెను. అట్లే 'సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి' అని ప్రారంభించిన ప్రయత్నమును 'సాగరం శోషయిష్యామి' (సము ద్రమును ఎండింప చేతును) అనునంత వఱకు వచ్చెను.

ఇక కృష్ణావతారమున సాందీపని మహర్షి వద్ద విద్యాభ్యాస ముచేసియు; గురుకట్నముగా ఎప్పుడో ప్రభాసతీర్థమున మునిగి మరణించిన తనపుత్రులను తెచ్చి యిమ్మని సాందీపుడు కోరగా అయ్యో సుంతయేని వైరాగ్యములేని గురువును గదా ఆశ్రయించి తిని అనివాపోయెను.

ఇట్లు తనకు ఆచార్యుడుగా శిష్యుడుగా కలిగిన అవద్యము లను సరిచేసుకొనుటకై భగవద్రామానుజుల నవతరింప జేసెను. కావున వారియందే గురుశబ్దము రూఢమై ప్రకాశించుచున్నది.

భగవద్రామానుజులకు ఆచార్యులు ఐదుగురు. వారు పెరియ నంబి(మహాపూర్ణులు) తిరుమల నంబి(శ్రీశైల పూర్ణులు) తిరుక్కోట్టి యార్ నంబి(గోష్ఠిపూర్ణులు) తిరువరంగ ప్పెరుమాళ్ అరయర్(శ్రీరం గాధిపదేశికులు) తిరుమాలై అండాన్(మాలాధరుడు). వీరిలో పెరి యనంబిగారి వలన పంచ సంస్కారములను, తిరుక్కోట్టియూర్ నంబిగారి వలన తిరుమంత్రార్థమును(చరమశ్లోకార్థమును) తిరుమల నంబిగారి వలన శ్రీరామాయణమును, తిరువరంగప్పెరుమాళ్ అర యర్ వలన దివ్యప్రబంధములను; తిరుమాలై అండాన్ వలన తిరు

వాయిమొళి యర్థమును సేవించిరి. పై ఆచార్యులందరు భగవద్రా మానుజులు తమ శిష్యులగుట తమ భాగ్యమని తలచి వారియందు గురుభావము తోనే యుండిరి. అది ఎట్లనగా, పెరియనంబి గారి విషయము: ఒకనాడు భగవద్రామానుజులు శిష్యసహితముగా వేం చేయు చుండగా చూచి పెరియనంబిగారు దండము సమర్పింపగా భాష్యకారులును నిషేధింపక ప్రత్యభివాదము చేసిరి. ఇది చూచిన శిష్యులు భాష్యకారులను 'ఆచార్యులు మీకు అభివాదము చేయగా వలదని చెప్పవలదా?' యనగా స్వామివారి యిష్టమును కాదనుట ఎట్లు? అని సమాధాన మిచ్చిరట. అదే విషయమును పెరియ నంబి గారిని అడుగగా వారు 'ఆళవన్దారు (యామునమునులు) తర్వాత అంతటి ఆచార్యపూర్తి కలిగినవారు వీరే! మా సదాచార్య సన్నిధికి సచ్ఛిష్య సన్నిధికి భేదము లేకపోవుటచే దండము సమ ర్పించితిని' అని పలికి, తమ కుమారులు పుండరీకాక్షులు అనువారిని భాష్యకారుల సన్నిధిని ఆశ్రయింప చేసిరి. (శిష్యులునుగా చేసిరి)

తిరుక్కోట్టియూర్ నంబి విషయము 'ఓరాణ్ వళియామ్ ఉప దేశిత్తార్ మున్నోర్' అను రీతిని పూర్వాచార్యులు తమ జీవిత కాలములో రహస్యార్థములను తగిన శిష్యలక్షణములుగల ఏ ఒక్క రికో మాత్రమే ఉపదేశించెడివారు. భగవద్రామానుజులు సైతము చరమశ్లోకము యొక్క అర్థమును తెలిసికొనుటకు తిరుక్కోట్టియా ర్నంబిగారి వద్దకు పదునెనిమిది పర్యాయములు వేంచేసిరి. అట్లు అనువర్తించిన గాని మంత్రము, మంత్రార్థము లభింపలేదు. చివ రకు నంబిగారు ఈ మంత్రార్థమును అయోగ్యులకు వెల్లడి చేయ నని ప్రమాణము చేయించుకొని చరమశ్లోకార్థమును ఉపదేశించిరి. ఆ అర్థమును వినగానే భాష్యకారులకు ఆనందము ఉన్మస్తకమై చేతనుల దుస్థితి గాంచి సర్వస్వమును దానము చేయగోరిన వాని వలె అచటగల వారందరకు ఆ దివ్యార్థము నుపదేశించిరి. అంతట ఈ ధిక్కారమునకు ఫలమేమియని ఆచార్యులైన నంబిగారు అడు

గగా నరకమే గదా, అయినను ఇందరు చేతనులు తలంపగా నేనొక్కడిని నరకమునకు పోయిననేమి? యని బదులు పలికిరట. ఇట్టి పరసమృద్ధి ప్రియత్వము సర్వేశ్వరునకు తప్ప మరియెవరికి కలదు? ఇట్టి సుగుణము మాకు లేకపోయెనే! ఆ సర్వేశ్వరుడే మీరా? అనుచు "ఎమ్బెరు మానారే" అని ఆలింగనము చేసికొనిరట. ఇటనొక చమత్కారము కలదు. ఎంబెరుమాన్ + ఆర్ (భగవంతుడు ఎవరు?) అనిప్రశ్న ఎంబెరుమానార్ (భగవద్రామానుజులు) అని సమాధానము. అంతేకాక తమకుమారులు తెఱ్ఱుకాళ్వాన్ అను వారిని స్వామికి శిష్యులనుగా చేసిరి.

ఇచట గమనింపవలసిన విషయము: భగవద్గీతలో గీతాచార్యుడు 'తద్విద్ధి ప్రణిపాతేన' ఇత్యాదిగా ప్రణిపతన, పరిప్రశ్న; సేవాదులచే అనువర్తించిన శిష్యునకు జ్ఞానియగు ఆచార్యుడు తత్వార్థమును ఉపదేశించునని చెప్పెను. అంతేకాక 'ఇదంతే నా తపస్కాయ నాభక్తాయ కదాచన నచాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోభ్యసూయతి' అని తపస్సు చేయనివానికి; భక్తి లేనివానికి; శుశ్రూష చేయని వానికి; భగవద్గుణ విభూతుల యందు అసూయ గలవానికి ఉపదేశింపరాదని చెప్పెను. మరియు "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" కర్మాదియోగములదుపాయత్వ బుద్ధిని విడచి నన్నే శరణు పొందుము" అనియు చెప్పెను. ఈవిధముగా తత్త్వజ్ఞానము తెలిసికొనగోరిన వానికి ఉండవలసిన లక్షణములను; సదాచార్యులను ఆశ్రయించు విధమును; సదాచార్య లబ్ధమైన జ్ఞానముచే తనను ఆశ్రయింపవలసిన పద్ధతిని వివరించెను. కానీ అట్టి అధికారి (యోగ్యుడు) ఈ కలిలో దొరకుట దుర్లభము గదా!

కావుననే ఎంబెరుమానారులు మనయొక్క యోగ్యతాయోగ్యతలను లెక్కింపక "ఆశయుడ యోర్కెల్లాం ఆరియరగాళ్ కూఱుమెన్ఱు" ఆశగల వారందఱకు ఉపదేశింపుడు అని ఆదేశించిరి.

వర్షము నిమ్నోన్నతములను, జలస్థలములను పర్వత సముద్రము లను లెక్కింపక అన్నిచోట్ల సమముగా వర్షించురీతిని భగవద్భాష్యకారుల కృపావర్షము కూడ సర్వులయందు సమముగా ప్రవహించినవి. వారు చేయుటేకాక తమ తరువాతి ఆచార్యులు కూడ చేయునట్లు నియమించిరి. లేనిచో ఆ మంత్రార్థము మనకెట్లు లభించెడిది?

తిరుమలనంబి గారి విషయము: ఒక పర్యాయము భగవద్రామానుజులవారు తిరుమల వేంచేయగా తిరుమలనంబి ఎదురేగి తిరుప్పరివిట్టము(తలపాగా) మున్నగునవి ప్రసాదింపగా భాష్యకారులు వారిని జూచి మీరే రావలెనా? మీ కంటె చిన్నవారులేరా యని అడిగిరట. అంత నంబిగారు నాలుగువీధులు తిరిగితిని, ఎక్కడ నాకంటె చిన్నవారు కనుపింపలేదు (శిఱుమా మానిశరాయ్ ఎన్నైయాండార్) అని సమాధానమిచ్చిరట. అంతేకాక తమ కుమారులు తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్లాన్? (పిళ్లై తిరుమల నంబి) అనువారిని శిష్యులుగా చేర్చిరి. మరియు గోవింద భట్టరును ఉదక పూర్వకముగా దానము నొసంగిరి.

తిరుమలై ఆండాన్ విషయము : భగవద్భాష్యకారులు వీరి సన్నిధిలో తిరువాయి మొళి అర్థమును సేవించు చుండెడివారు. "అఱియా క్కాలత్తుళ్లే" అను పాశురము కాలక్షేపమగుచుండగా స్వామి ఆ పాశురమును ఉపకార స్మృతిపరముగా వ్యాఖ్యానింపగా ఆండాన్ కోపించి ఇది విశ్వామిత్ర సృష్టివలె నున్నదే అని పలికి కాలక్షేపమును మానిరి. ఈ విషయము తెలిసిన తిరుక్కోట్టియూర్ నంబి వేంచేసి "సాన్దీపని వద్ద శ్రీకృష్ణుడధ్యయనము చేసినట్లు వీరును మీ వద్ద తిరువాయిమొళిని సేవించుచున్నారు. వారు చెప్పిన అర్థము ఆళ్వదారు చెప్పగా నేను వింటినిఅని సమాధాన పరచిరట. మరియొకసారి స్వామి కొన్ని పాశురములను "ఆళ్వాం

దారు ఇట్లు చెప్పియుందురు అని పలుకగా ఆండాన్ మీరు వారిని చూచియైన యుండలేదే? వారి అభిప్రాయము మీకు తెలియుట ఎట్లు అని ప్రశ్నింపగా స్వామి నేను ఆళ్వందార్లకు ఏకలవ్య శిష్యుడను కానా! అని సమాధానమిచ్చిరట. ఆ మాటలు విని వీరి ప్రభావమున కాశ్చర్యపడి ఆండాన్ దండము సమర్పించి ఇదియు ఒక భగవదవతారమా? అని పలికి తమ కుమారులు సుందరబాహు పులను శిష్యులుగా చేసిరి.

తిరువరంగ ప్పెరుమాళ్ అరయర్ విషయము :

ఉడయవర్ వీరి సన్నిధిలో ఆరుమాసములు దివ్య ప్రబంధ ములు సేవించిరి. ఒకనాడు ఆచార్యులకు అభ్యంగనము చేయగా వారు సంప్రీతులై "నా సర్వస్వమును కొల్లగొట్టుటకే యిట్లు చేసి నారుగదా" అని పలికి పంచమోపాయ నిష్ఠను (ఆచార్యాభిమానమే ఉత్తారకము) అనుగ్రహించి తమ కుమారులు తిరువాయిమొళి అర యర్ అనువారిని శిష్యులనుగా చేసిరి.

ఈ విధముగా భగవద్రామానుజుల ఆచార్యులు తాము వారికి ఆచార్యులగుటు తమ సుకృత విశేషముగా భావించియు, వారిని తమ ఆచార్యులుగా గౌరవించియు. తమ దేహసంబంధు లైన కుమారులను శిష్యులనుగా చేసియు స్వామి వైభవమును ప్రకాశింప చేసిరి. ఇట్టి ఆచార్యులు సర్వేశ్వరునకు లభింపరైరి.

సదాచార్య సమాశ్రయణము వలననే తత్వజ్ఞానము కలు గును. "తద్విజ్ఞానార్థం సగురుమేవాభి గచ్ఛేత్" అనిశ్రుతి ఈ విష యమునే తెలుపుచున్నది. ఆచార్యులద్వారా తత్వజ్ఞానామును పొం దిన వారే ఆచార్యస్థానము నందుండుట తగును. కానీ ఆచార్య సంబంధము లేనివారు గురుపీఠమునకు తగరు సర్వేశ్వరుడు "నత్వత్సమో స్త్యభ్యధికః కుతోన్యః" అనునట్లు ఆయనతో సమా నుడే లేనపుడు అధికుడెట్లు లభించును? కావుననే ఆయనకు ఆచా

ర్యులెవ్వరును లేకపోయిరి. ఆచార్యులు లేకపోవుటచేతనే వారికి శిష్యులును లభింపక తానే శిష్యుడును కావలసివచ్చెను. కృష్ణావతారమున దొరికిన శిష్యుడును మతిమరపు గలవాడయ్యెను. ఈ విషయమును గుర్తించియే కాబోలు భారతయుద్ధానంతరము "కృష్ణం ధర్మం సనాతనమ్" అనునట్లు తాను సాక్షాత్ ధర్మస్వరూపుడై యుండియు "భీష్ముడస్తమించిన జ్ఞానమే నశించునని" పలికి ధర్మనందనుని ముందు నిలిపి భీష్మునిచే విష్ణుసహస్రనామమును ఉపదేశింపచేసెను. భీష్మునకు పరశురాముడాచార్యు డగుట చేతను' ధర్మరాజు ప్రణిపతన, పరిప్రశ్నాద్యను వర్తనముగల శిష్యుడగుటచేతను ఆ బోధనము ఫలించెను. కావుననే భీష్ముడు భీష్మాచార్యులైరి. శ్రీ విష్ణుసహస్రనామము సర్వపురుషార్థ ప్రదమయ్యెను. మనము కూడ యిట్టి ఆచార్యులను సేవించియుండ వలసినదే! మనకు లభ్యులు కారైరిగదా! అని తలచి కలియుగమున భగవద్రామానుజులకు శిష్యులై పంచసంస్కారములను పొందిరి. భగవత్ భాష్యకారుల సహస్రనామ స్తోత్రములో "శ్రీవేంకటా చలాధీశ శంఖచక్ర ప్రదాయకః అను తిరునామము కలదు. అప్పనుక్కు చెంగాళి అళిత్తరుళుం పెరుమాళ్" (శ్రీనివాసునకు శంఖచక్రములను ప్రసాదించిన స్వామి) అనియు ప్రసిద్ధి నొందిరి.

శ్రీనివాసుడు ఒకానొక కాలమున శతృనిర్మూలనకై తొండమాన్ చక్రవర్తికి తన శంఖచక్రముల నిచ్చియుండెను. అది మొదలు శంఖచక్రములు లేక యుండెను. కొంతకాలము గడచినది. అర్చకస్వాములు అక్రమప్రవర్తకులుకాగా రాజు దండింపదలచెను. వారు తిరుమలను వదలి పలాయితులైరి. ఇది అవకాశముగా శైవులు తిరుమలను ఆక్రమించి స్వామి పుష్కరిణిని కుమారస్వామి పుష్కరిణిగాను, శ్రీనివాసుని శివునిగాను ప్రచారము చేయుచుండగా భగవద్రామానుజుల చటకు వేంచేసి శివ అసాధారణ చిహ్నములైన త్రిశూల భస్మాదులను, విష్ణు చిహ్నములైన శంఖ చక్రము

లను గర్భాలయము నందుంచి తాళము వేసి ఉదయము ఏ చిహ్నములతో సేవసాయింతురో (కనబడుదురో) అస్వామియని తీర్మానము చేసిరి. ఆ రాత్రి తమ యోగమహిమతో శ్రీ ని వా సు ని ప్రార్థించి శంఖ చక్రములను ధరింపజేసిరి. ఇట్లు స్వామికి శంఖ చక్రములు తిరుమణి ప్రసాదించుటచేత (తాపపుండ్ర సంస్కారములచేత) అచార్యులైరి. కావుననే నేటికిని తిరుమలలో శ్రీనివాసుని సన్నిధికంటె భాష్యకారుల సన్నిధి ఎత్తుగ నుండుటయు, శ్రీనివాసుడు సన్నిధినుండి బయటకు వేంచేయునపుడు, తిరిగి సన్నిధిలోనికి వేంచేయునపుడు భగవద్రామానుజుల వారికి సేవ సాయించుటయు జరుగుచున్నది.

మరియొక ఐతిహ్యము - ద్వయమంత్రము వినుట:

ఒక పర్యాయము భగవద్రామానుజులు తిరుక్కురుంగుడి వేంచే॰ స్వామిని సేవింపగా స్వామియు ఉడయవరుల శిష్యపరివారమును వారి వైభవమును చూచి ఆశ్చర్యపడి తగిన సత్కృతులనొనర్చి ఇట్లనిరి. "స్వామీ! రామానుజా! 'బహూని మే వ్యతీతాని' అనునట్లు ఎన్నియో అవతారములను ధరించితిని. అన్ని అవతారములలోను ఎంత ప్రయాసపడినను ఒక్కచేతనుడును నాకు లభింపలేదే! ఈ చేతనులు అసుర ప్రకృతులై అనేక జన్మలెత్తుచు నన్ను పొందలేక అధోగతికి పోవుచున్నారే. అట్టి చేతనులందరును మీకు వశ్యులైన విధము చూడగా నాశ్చర్యముగానున్నది. ఆ రహస్యమేమో నాకును చెప్పుడు" అనగా భాష్యకారులు "స్వామీ తత్త్వజిజ్ఞాసువైన వాడు పెద్దలవలన రహస్యములను తెలిసికొనవలసిన విధమును నీవు చెప్పితివి గదా! ఆ క్రమము ననుసరించి వచ్చిన తప్పక తెలిపెదను" అని బదులు పలికిరి. అంత తిరుక్కురుంగుడి నంబియు తాను దివ్యసింహాసనము నుండి దిగి రత్నకంబళముపై క్రిందకు వేంచేసి ఉడయవరులను దివ్య సింహాసనమునందు కూర్చుండచేసి 'ఇపుడు చెప్పుడు' అని ప్రార్థింపగా భగవ

దాశరథి మానుజులును స్వాచార్య ప్రాచార్యులను స్మరించి నంబికి ద్వయ మంత్రమునుపదేశించిరట. అది మొదలు తిరుక్కురుంగుడి నంబికి రామానుశనంబియను తిరునామము ప్రసిద్ధ మయ్యెను. నాటితో సర్వేశ్వరునకు తగిన ఆచార్యుడు లభింపలేదే యను చింత తొలగెను. ఈ రీతిని ఆచార్యులుగా వారి వైభవము ప్రకాశించినది.

స్వామి ఎంబెరుమానారుల శ్రీ పాదము లాశ్రయించిన వారిలో పరమవైరాగ్య సంపన్నులైన కూరత్తాళ్వాన్ (కూరేశ మిశ్రులు) మొదలియాండాన్ (దాశరథి) ఎంబార్; అరుళాళప్పె రుమాళ్ ఎంబెరుమానార్; నడాదూరు అమ్మాళ్; కిడాంబి ఆచ్చాన్' వడుగనంబి మున్నగువారు అంతరంగ కైంకర్య నిర్వాహకులై యుండిరి. ఈ ఆచార్యులందరును తమకు ఉపాయోపేయములు రామానుజ చరణారవిందములే అని నమ్మియుండిరి.

వారిలో పరమవైరాగ్య సంపన్నులు కూరనాథులు "యదు క్తయ స్త్రయీ కంఠే యాంతి మంగళ సూత్రతామ్" (ఎవరి శ్రీ సూక్తులు వేదమాత కంఠమున తిరుమాంగల్యములుగా ప్రకాశించి నవో) అనునట్లు కీర్తివహించిరి. వీరు చోళరాజో పద్రవమువలన నేత్రములు కోల్పోయి ఉడయవరుల ఆజ్ఞచే వరదరాజస్తవము రచింపగా వరదరాజస్వామి ప్రత్యక్షమై "ఆళ్వానే! వరమును కోరుకొనుడు" అని ఆజ్ఞాపింపగా ఆళ్వాన్ 'ఇంతటి ఉపద్రవము నకు కారణమైన నాలూరాన్ అను ఆ వైష్ణవుని క్షమించి పరమ పదమునను గ్రహింపుడు. ఇదియే నాకు కావలసిన వరము" అని కోరిరి. "మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వంతి యేనరాః। కల్పకోటి శతేనాపి నక్షమామి వసుంధరే! (నాభక్తుడు శ్వపచుడై నను వానిని నిందింపరాదు. అట్టి భక్తనిందకుడు కోటి కల్పాంత ములు జన్మించినను నా కృపకు పాత్రుడు కాజాలడు. వానిని క్షమింపను) అని సర్వేశ్వరు డానతిచ్చి యుండగా ఉడయవరుల

విషయమున వారి ఆచార్య(పెరియనంబి) శిష్యుల (కూరత్తాళ్వాన్) విషయముననేగాక సమస్త శ్రీవైష్ణవుల విషయమునను ఘోరాపచారమును చేసిన "నాలూరాన్‌కు" విముక్తి లభించుట ఎట్లు? అశోక వనములో సీతాదేవి విషయమున రాక్షసస్త్రీలు గావించిన అపచారముకంటె, సాక్షాత్ రావణుడు గావించిన అపచారముకంటె తీవ్రమైన భాగవతాపచారము కదా! వీనికి నిష్కృతి ఏమి? అని తలచి పరమకరుణా స్వభావులగుటచే అట్టి వరమును ప్రార్థించిరి కూరత్తాళ్వాన్. ఇట్టి దయాస్వభావులు కదా! భాష్యకారుల శిష్యులు. అట్లే మరియొకనాడు అరటి ఆకు కోయగా నొసకారుటజూచి ఈ చెట్టునకు బాధ కలిగించితినికదా అని మూర్ఛిల్లిరట.

భాష్యకారుల అభయ ప్రదానము : అయోధ్యావాసులు నిండు పేరోలగమున దశరథునితో "బహవో నృప కళ్యాణగుణాః పుత్రస్య సన్తితే! (ఓ రాజా! నీకుమారునిలో అనేక కళ్యాణ గుణములు కలవు) అని ప్రారంభించి శ్రీరామచంద్రుని కళ్యాణ గుణములను ప్రస్తుతించిరి. ఆ గుణములలో ప్రధానమైనది దయాగుణము. "వ్యసనేషు మనుష్యాణాం భృశంభవతి దుఃఖితః" అని ఆగుణమును విశదీకరించిరి. వాల్మీకి మహర్షియు "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చవీర్యవాన్" అనియు 'వశీవదాన్యో గుణవాన్' అని ఆళ్వందార్లు సాయించిన(చెప్పిన)దియు ఈ దయాగుణమునే కదా! అది శ్రీ రామచంద్రునిలో పరాకాష్ఠ చెందినది. దానిని ఊతగా కొనియే వేదాంతదేశికులవారు శ్రీరామచంద్రుని "కరుణా కాకుత్థ్స" అని ప్రశంసించిరి. ప్రపన్న జనకూటస్థులైన నమ్మాళ్వార్లును ఈదయాగుణము నాధారముగా చేసుకొనియే "కఱ్పారి రామ పిరానయల్లాల్ మత్తుం కఱ్పరో!" అని అందురు. విభీషణుడు రావణునిచే ధిక్కరింపబడి 'ఖస్థ ఏవ వ్యతిష్ఠత' అనునట్లు ఆకాశము నందే నిలబడి "పరిత్యక్తా మయా లంకామిత్రాణిచ ధనానిచ" అనియు 'త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం

శరణంగతః' అనియు ప్రాప్త విరోధులను వదలి వచ్చితి ననియు; 'రావణో నామ దుర్వృత్తః' అని ప్రారంభించి 'తస్యాహ మనుజో భ్రాతా' అని తన ప్రాప్యత్వరను వెల్లడించినను సుగ్రీవాదులు విభీషణుని కాశ్రయ మీయువలదని నిషేధించుటయేకాక, 'వధ్య తామ్' (వధింపబడుగాక) అని ఆయుధములను చేబూనిరి. శ్రీరామ చంద్రుడు తాను కరుణాసముద్రుడై యుండియు; 'దోషోయద్యపి తస్యస్యాత్' దోషములున్నను ఆశ్రయించిన వానిని రక్షించియే తీరుదును' అను పట్టుదల కలిగియుండియు విభీషణుని కఠోర పరీక్షకు గురిచేసి సుగ్రీవాదులచే నిష్ఠురముగా పలికించి చివరకుగదా కటాక్షించిరి. కానీ భగవద్రామానుజుల కరుణ అట్లుగాక నిర్నిమిత్తముగనే అందరి యందును ప్రవహించినది. శ్రీరామచంద్రుడు 'తవాస్మి' అని నోరార పలికిన వానికి ఆశ్రయమిత్తుననెను. కానీ ఉడయవరులు పలుకలేని మూగవానిని తమ తిరుమేనిని శ్రీపాదములజూపి ఇవియే రక్షకములని భావించి యుండుమని ఆనతిచ్చిరట. ఇది చూచిన కూరత్తాళ్వాన్ అయ్యో కూరవంశమున జన్మించి, శాస్త్రముల చదివిచెడితినే! నేనుకూడ మూగవాడనైనచో ఇంతటి సులభోపాయము లభించెడిది గదా! యని వాపోయిరట. ఈ విధముగా భగవద్రామానుజులు ఏ నిబంధనము లేకయే (condition) 'నల్లార్గళ్ నణ్ణుం తిరునాట్టైనాన్ తరువన్' సత్పురుషులందరకు పరమపదమును ప్రసాదింతును అని కటాక్షించినారు.

స్వామి రామానుజులు విభీషణ శరణాగతిని గూర్చి చెప్పుచుండగా ధనుర్దాసు వెక్కివెక్కి ఏడ్వ మొదలిడెను. భాష్యకారులది చూచి 'ఏల! ఏడ్చుచుంటివి?' అని ప్రశ్నింపగా "ప్రతిబంధకములను వదలి ఆకాశమున నిలచిన విభీషణుని అన్ని పరీక్షలకు గురిచేసి గదా అనుగ్రహించినాడు. అట్టివాడు దేనిని వదలని నన్ను అనుగ్రహించునా? అని దుఃఖించుచుంటిని" అనిబదులు పలికిరి. అంత భగవద్రామానుజులు "మీకా భయము వలదు. మీకు నేనుం

టిని. నాకు పెరియనంబిగారు గలరు. వారికి ఆళ్వందారులు; ఆపై వారికి "అవావత్తవీడు పెత్త" అని పలికిన నమ్మాళ్వార్లు కలరు; నమ్మాళ్వార్లకు పరమపదమున్నచో నాకు కలదు. నాకున్నదైన మీకును కలదు అనిరట. ఇది భగవద్రామానుజు లనుగ్రహించిన అభయప్రదానము.

సర్వేశ్వరుని అనుగ్రహము కంటె భాష్యకారుల అనుగ్రహము విలక్షణమైనది. ఆయన నిరంకుశ స్వతంత్రుడు కాన అనుగ్రహింపవచ్చును. లేక ఆగ్రహింపను వచ్చును. ఆయన మన ప్రయత్నములచే అనుగ్రహింపడు. "కేవలం స్వేచ్ఛయైవ" అనియు "యమేవైష వృణుతే తేనలభ్యః" అనియు ఆయన తలచిననే అనుగ్రహించును. మననుండి యేమియు కోరడు. ఆయన స్వాతంత్ర్యమును సేవింతము.

దండ కారణ్యములోని రాక్షసులను సంహరింతునని ప్రతిజ్ఞ శ్రీరామచంద్రుడు చేసినాడు అపుడు సీతాదేవి "బుద్ధివైరం వినాహంతుం రాక్షసాన్ దండకాశ్రితాన్ అపరాధం వినాహంతుం లోకాన్ వీరనీకామయే" అని నివర్తింపచూచెను.

అంతేకాక దయాగుణమున శ్రీరాముని కంటె లక్ష్మణులే అధికమని తలంచియే సీతాదేవి "సత్యసంధ! మహాభాగ! శ్రీమన్ లక్ష్మణ పూర్వజ! (లక్ష్మణ పూర్వజ లక్ష్మనునికంటె ముందు జన్మించినందుకు మీకు అధికముగా దయాగుణముండ వలదా!) అని స్తుతించిరి. చివరకు "విచార్య బుద్ధ్యాతు తవానుజేన యద్రోచతే తత్కురు మాచిరేణ" అని ఏదో స్త్రీబుద్ధికి తోచినట్లు చెప్పితిని. నీకు ధర్మము చెప్పువాడెవరు? అయినను నీతమ్మునితో ఆలోచించి నీకు తోచినట్లు చేయుము.

స్వామి : నాకు తోచినట్లు చేయదలంచిన లక్ష్మనుని అడుగనేల?

సీత : ఆయన నిన్ని ప్రియత్నమునుండి విరమింపజేయును.

శ్రీరామ : ముందుగా నీవు వారించితివి గదా!

సీత : నా మాట మన్నింపరేమో! నా కంటె మీకు లక్ష్మణులు అధికులు గదా! వారిమాటను బాటను మీరజాలరుగదా!

శ్రీరామ : అట్లైన నేను ఆలోచింపనే ఆలోచింపను.

అనునట్లుగా లక్ష్మణునితో ఆలోచింపకయే శతృసంహారము చేసెను. ఇటు సీతాదేవి రాక్షససంహారము వలదన్నను చేసియేతీరెను. పిదప విభీషణుని విషయమున సుగ్రీవాదులు దండించియే తీరవలెను అని చెప్పినను అనుగ్రహించియే తీరెను. ఇట్టి స్వతంతృడు సర్వేశ్వరుడు. ఇట్టి వానిని ఆశ్రయించునపుడు తగిన జాగ్రత్త వహింపవలెను. సౌలభ్యమును చూచి దగ్గరకు చేరునట్లే పరత్వమునుచూచి భయపడను వచ్చును. ఆయన ఎంత దాచినను దాగనిది పరత్వము. 'గచ్ఛలోకాన నుత్తమాన్' 'జగత్సశైలం పరివర్తయామ్యహమ్' "సాగరం శోషయిష్యామి" ఇత్యాది వాక్యములు పరత్వమును చాటుచునేయున్నవి. "తమసః పరమోధాతా శంఖ చక్రగదాధరః" అని మండోదరి పరత్వమును ప్రకాశింప చేసెను. 'పాతు ప్రణతరక్షాయం ప్రలంబమ సహన్నివ' అనునట్లు ఆశ్రితరక్షణకై ధరించిన పంచాయుధములను చూచినమనకు భయం కలుగవచ్చును. శ్రీకృష్ణుని దృష్టిమాత్రముననే సుదర్శనము కృత్యను తరిమి కాశీనగరమును కాల్చినది. అట్లే మన దోషములుకని మనలను శిక్షింపవచ్చును. అభయముచే స్వామిదగ్గరకు చేరుటకు మనము భయపడవచ్చును. శ్రీరామచంద్రుని సౌందర్యమును సేవించి ఆశ్రయింప తగినవాడని తలచియు సుగ్రీవుడు శ్రీరాముని ధనుర్బాణములను చూచి భయపడెను కదా! ఇట్టిదే మన స్థితియు. కానీ భగవద్రామానుజుల కృప అట్టిదికాదు. పరత్వగంధమే లేని సౌలభ్యము వీరిది. కావుననే మనము చేరుటకు వారు మనలను క్షమించి భగవత్సన్నిధిని చేర్చుటకు పిలుచుచున్నది. ఈ విషయ

ముననే మణవాళ మహాමునులు 'అదికార ముండేల్ అరంగర్ ఇరంగారో! అదికారమిల్లా దార్కన్ట్రో ఎతిరాశా నీయిరజ్జి వేండు వదు; నీయుం అదికార గుళుక్కె యిరంగిల్ ఎన్శెయ్వోంయాం॥ యతిరాజా! జ్ఞానానుష్ఠాన పూర్తికలవారిని అనుగ్రహించుటకు శ్రీరంగనాథులు లేరా! మీరును అట్టివారినే రక్షించినచో మేమేమి చేయగలము?" అని యతిరాజుల కృపావైశద్యమును వెల్లడించిరి.

సర్వేశ్వరుడు ఒకనాడైనను క్షిపామి అనవచ్చును. నక్షమామి అనవచ్చును. క్షమాస్వరూపిణియైన శ్రీదేవియే ఆగ్రహింపవచ్చును. (భృగుమహర్షిపై కోపించినట్లు) విష్వక్సేనులు, నిత్యసూరులు కోపింపవచ్చును. మన అపరాధములే వారికి కోపకారణములు. ఇన్ని అపరాధములు చేసినను క్షమించి ఆదరించు స్వభావము రామానుజులకే కలదు. "ఎన్నుడైయపిళైపొక్కయావర్కుక్కుముడియుం; ఎతిరాశా! ఉనకన్ఱియాన్ ఒరువర్ క్కాగేన్ యతిరాజా! నా అపరాధములను క్షమించుటకు ఎవరికి సాధ్యము? మీకు తప్ప నేను వేరెవరికి శేషభూతుడను కాను; అని వారి పరమకృపను కీర్తించినారు మణవాళ మహామునులు. ఈకృప వారితో నిలువక వారిసంబంధుల వరకు వ్యాపించిన విషయము శ్రీకూరత్తాళ్వాన్ విషయమున ప్రస్తావింపబడినదిగదా!

కావుననే వడుగనంబి యిట్లనియెడివారు. 'ఆచార్య పదమని వేరే ఒకపదము కలదు. అది భగవద్రామానుజుల వారియందే ప్రవర్తించును. అందరకు వారి శ్రీ చరణములే శరణము. వేరు ఉపాయముకాని ఉపేయముగాని లేదు. ఈ విషయమునే కణియనూర్ శిఱియాచ్చాన్ అనువారు సచేలస్నానము చేసి "భగవద్రామానుజుల చరణారవిందములు కంటె వేరు రక్షకములు లేవు" అని ప్రతిజ్ఞ చేసి చెప్పిరట.

గీతాచార్యుడు కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగము లందు ఉపాయత్వ బుద్ధిని విడచి ప్రపత్తి చేయవలసినదని చెప్పెను. అట్టి ప్రపన్నుని కటాక్షింతునని తెలియజేసెను.(తలచినచో) కానీ తిరువరంగత్తు ముదనారులు(శ్రీరంగామృత కవి) కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తు లేవియు ఉపాయములు కావనియు భగవద్రామానుజుల చరణారవిందములే ఉపాయ ఉపేయములనియు నిష్కర్షించిరి.

శ్రీమన్నారాయణుని ప్రకాశింపజేయు మంత్రములలో అష్టాక్షరీ మహామంత్రము శిష్టజన పరిగృహీతమై అర్థపూర్తి కలిగియున్నది. ఎనిమిది అక్షరములు గల ఆ మంత్రము కంటెను నాల్గు అక్షరములు గలిగి నారాయణుని యందు ప్రీతిని కలుగచేసి, భువనత్రయపావనమై; సంసారరోగమును నిర్మూలించు 'రామానుజ' అను మంత్రమే ప్రధానము. అదియే లేనిచో మనగతి యేమయ్యెడిది? అనుచు "నచేత్ రామానుజేత్యేషా చతురా చతురక్షరీ। కామవస్థాం ప్రపద్యన్తే జంతవో హంత మాదృశః॥" అని కూరత్తాళ్వాన్ అనుగ్రహించిరి.

'రామానుజ' అను నాల్గు అక్షరములే తిరుమంత్రము. వారి సన్నిధిలో చేయు కైంకర్యమే పురుషార్థము. ఇదియే నిశ్చయమైన నా సిద్ధాన్తమని నడాదూరు అమ్మాళ్ సాయించెడివారు.

కృష్ణావతారమున భగవానుడను గ్రహించిన గీతాశాస్త్రమును అర్జునుడు మరచుట జరిగినది. కానీ భగవద్రామానుజుల శ్రీభాష్య రచనకు తోడ్పడినవారు వారి శిష్య ప్రధానులైన కూరనాథులు. అంతేకాక స్వామి శిష్య ప్రశిష్యులద్వారా శ్రీభాష్య ప్రవచనము నేటికిని అవిచ్ఛిన్నముగా సాగుచున్నది. అంతియు కాదు అనాడు భగవానుడు తాననుగ్రహించిన గీతాశాస్త్ర యాదార్థ్యమును తెలుపుటకై భగవద్రామానుజుల ద్వారా గీతాభాష్యము నవతరింపజేసెను.

ఇట్లు సర్వేశ్వరుడు రామకృష్ణాద్యవతారములందు తనకు కలిగిన లోటును స్వామి ఎంబెరుమానారులద్వారా తీర్చుకొనెను. కావున వీరి విషయముననే గురుశబ్దము అర్థవత్తరమై యున్నది.

సర్వేశ్వరునకు చేతనులతో గల సంబంధములలో పితాపుత్ర సంబంధము మొదటిది. ఈ సంబంధము ప్రణవ (తిరుమంత్రము) నందలి 'అ' అనుపదము తెలియజేయుచున్నది. ఆళ్వార్లును 'ఎనక్కుత్తాయామ్ తన్దయాయ్' (నాకు నీవే తల్లివి తండ్రివి) యని స్తుతించిరి. ఇది ప్రథమ పర్వ నిష్ఠ (మొదటిమెట్టు) "తన్దైనల్ తాయ్‌తారమ్ తనయర్ పెరుంశెల్వమ్ ఎనక్కునీయే యెతిరాశా!" (నాకు తల్లి [తండ్రి] భార్య, పుత్రులు, సంపద అన్నియు నీవే) అనునది చరమ పర్వ నిష్ఠ (చివరిమెట్టు). కావున సంసారమున పడియున్న మనలను ఉద్ధరించుటకై తల్లివలె పరువెత్తి యీసంసార కూపమునందవతరించినారు రామానుజులు. "సిద్ధిర్భవతివా నేతి సంశయోచ్యుత సేవినాం। నసంశయోస్తి తద్భక్త పరిచర్యారతాత్మనామ్" సర్వేశ్వరుని ఆశ్రయించిన వారికి ఫలవిషయమై సందేహము కలుగవచ్చునేమో కానీ వారి పాదాశ్రితులను ఆశ్రయించినవారికి తప్పక ఫలము లభించును. సంశయము వలదు రామానుజ చరణములే మనకు రక్షకములు మోక్షప్రదములు. అందులకు గోపాంగనా వృత్తాంతమే ఉదాహరణము.

భగవద్రామానుజు లోకపరి తిరుమల వేంచేసినపుడు తుంబయూర్ కొండి యను గోపాంగన పెరుగుతెచ్చి యిచ్చెడిదట. ఒకనాడు క్రయద్రవ్యమునకై స్వామి వద్దకు వచ్చెను. స్వామి ఆజ్ఞానుసారము కిడాంబి అబ్బాన్ ఆనెలకు స్వామి శ్రీపాదతీర్థమును, ప్రసాదమును అనుగ్రహింపగా ఆమహిమచే సద్యోజ్ఞానము కలిగి క్రయద్రవ్యమునకు మారుగా మోక్షముకోరెను. అంతేకాక తనకు మోక్షము లభించునట్లు శ్రీనివాసునకొక చీటీవ్రాసి

యిమ్మని స్వామిచే వ్రాయించుకొని వేంకటేశ్వరు సన్నిధిని ఆ చీటీచూపి పరమపదమును చేరెను.

ఇట్లే ఒక పర్యాయము కిడాంబి ఆచ్చాన్ తిరుమాలిరుం శోలై మలై దివ్య దేశమున కేగి స్వామిని సేవించి వారి ఆజ్ఞచే స్తోత్ర రత్నమందలి "అపరాధ సహస్రభాజనం" అనుశ్లోకమును అనుసంధానము చేయుచుండ "అగతిం" అని అనగానే సుందరబాహుప్పెరుమాళ్ "మీరు రామానుజులను ఆశ్రయించి యుండియు 'అగతిం' అని అనవచ్చునా? అని నిషేధించిరి అనగా భగవద్రామానుజుల సంబంధులు గతిలేనివారు కారని భావము.

కాంచీపురమున నొక భాగవతుల కుటుంబమున జన్మించిన పిల్లవాడు ఆరుసంవత్సరములవరకు మూగవాడుగా నుండి కొన్ని సంవత్సరములు కనబడక పిదప కొన్నాళ్ళకు కనబడగా నీవెచటకి పోతివి అని అందరు అడుగగా "క్షీరాబ్ధి"కి పోతిని అని సమాధానముచెప్పెనట. అందులకు వారు అచ్చటి విశేషమేమనగా "విష్వక్సేనులే రామానుజులుగా అవతరించినారని అచట చెప్పుకొనుచున్నారని" పలికెను. తర్వాత అతడు మరియెవరికిని కనబడకపోయెను.

చోళోపద్రవము వలన భాష్యకారులు మైసూరు ప్రాంతము వేంచేసిరి. అచట స్వామి ఉపన్యాసములకు ప్రజలు ముగ్ధులుకాగా 'మా పరమాచార్యులైన ఆళ్వందారుల శ్రీసూక్తుల ననుసరించి చెప్పితిని. వారి గోష్ఠిలో ఒక్కనాడైనను యుంటినేని పరమపదమునకు సోపానములు నిర్మించియుండనా?' అని పలికిరి. పై విషయముల వలన భగవద్రామానుజుల ఆచార్యపూర్తి, వైభవము వెల్లడి యగుచున్నది.

వీరి వైభవమొక మహాసముద్రము. అందు ఒకబిందువునైన

గ్రహింపజాలని అల్పజ్ఞుడను. అయిననను భగవద్రామానుజుల యందు ("పై తామహం ధనం")అనునట్లుగా మాకు సర్వవిధబంధువు, ధనమునైన) గల ప్రీతి విశేషముచేతను; వారి కృపచేతను; భగవద్రామానుజ కైంకర్యైక నిరతులై; సదా వారిగుణానుభవమే ప్రాప్యమని తలంచిన మా పెద్దల ఆచార్యుల అనుగ్రహము చేతను ఈ కొలది విషయములను ప్రస్తావించితిని. పెద్దలు నా సాహసమును మన్నింతురు గాక యని సవినయముగా ప్రార్థించుచున్నాను.

పొత్తరమ్ శీలత్తి రామానుశ; నిన్పుగళ్ తెరిన్దు
శాత్తువనేల్ అదు తాళ్వదు తీరిల్; ఉన్శీర్ తనక్కోర్
ఏత్తమెన్టే కొండి రిక్కులుమ్ ఎన్మనమేత్తియన్టి
అత్త గిల్లాదు ఇదత్కెన్ని నైవా యెన్టిట్టిఙ్జువనే॥

(భగవద్రామానుజా! అనంతములైన నీ కళ్యాణగుణములను తెలిసి పలికితిని అన్నచో అది నీకు అవద్యమే! పలుక కుండుటయే మేలు. కానీ నామనస్సు మిమ్ము స్తుతింపక నిలువజాలదు. ఈ విషయమున మీరేమి తలంతురో యని భయపడుచున్నాను.

శ్రీమన్మహా భూతపురే శ్రీమత్కేశవ యజ్వనః
కాంతిమత్యాం ప్రసూతాయ యతిరాజాయ మంగళమ్॥



